ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారి బహుమతి పొందిన

శంకర్స్

# బొమ్మల బాలభారతము

రచయితలు :

దాశరథి : సి. నారాయణరెడ్డి



ప్రకాశకులు :

కొండా శంకరయ్య

పుస్తకముల వ్యాపారము

సికింద్రాబాదు : : హైద్రాబాదు : : వరంగల్.

# మనవి

"తింటే గారెలే తినాలి, వింటే భారతమే వినాలి" అను సామెత లోక ప్రసిద్ధమైనది. వ్యాస మహర్షి విరచితమైన మహాభారతము పంచమవేదముగా పేరువడసి అనేక చక్కని నీతుల నందించి ప్రజల మన్ననలను పొందినదనుటలో సందేహములేదు. అట్టి పవిత్ర గ్రంథమును అనేక మంది కవి, పండితులు అనేక తీరుల తెలుగులోనికి అనువదించి యున్నారు. అట్టి మహా గ్రంథములు అన్నియు కూడ విద్యాధికులగు పెద్దలకు మాత్రమే అందుబాటులో నున్నవి. కాని పిల్లల కందుబాటులో లేవు.

ఇటీవల కొందరు ప్రకాశకులు ఇట్టి గ్రంథములను పిల్లల కనువగు తీరులలో ముద్రించు చుండుట ప్రశంసనీయము. "చంద్రునికొక నూలుపోగు" అన్నట్లు తెలుగు బాలబాలికా లోకము నకు రామాయణ, భారత, భాగవతాది గ్రంథములను వారికి తగుశైలిలో చక్కని చిత్రపటముల ద్వారా అందించదలచి కృషి చేయుచున్నాము. ఇంతవరకు "శంకర్స్ బొమ్మల బాల రామా యణమును" పై ప్రయత్నములోని తొలి పుష్పముగా బాల లోకానికి అందించితిమి. దానికి లభించిన ప్రోత్సాహమునకు మే మెంతయో సంతసించుచు ద్విగుణీకృతోత్సాహముతో "శంకర్స్ బొమ్మల బాల భారత" మను నీ చిన్ని పొత్తమును ద్వితీయ పుష్పముగా పంచరంగుల ముఖ చిత్రముతో నందించుచున్నాము.

అనుభవజ్ఞులు, బాల సాహిత్య రచనలో సిద్ధహస్తులును నగు రచయితలు సులభశైలిలో కథను నడపుచు అచ్చటచ్చట చక్కని గేయములను కూడ రచించుట ఇందలి యొక్క ప్రత్యేకత యని చెప్పవచ్చును. అందులకు మే మెంతయు వారికి కృతజ్ఞులము. అట్లే కథ కనువగు చక్కని చిత్రములను చిత్రించి యిచ్చిన శ్రీ బి. పి. రాజుగారికికూడ మా కృతజ్ఞతను తెలుపక పోవుట తప్పిదమే కాగలదు. మా యీ కృషికి పిన్నలు, పెద్దలు కూడ తగు ప్రోత్సాహమిచ్చి మా సంకల్ప సిద్ధికి తోడ్పడగలరని ఆశించుచున్నాము.

ఇట్లు
ప్రకాశకులు

# ముందుమాట

భారతాన్ని అయిదవ వేదం అంటారు. భారత దేశంలో అందరికి ఇష్ట మైన గ్రంథం ఇది. ధర్మ శాస్త్రజ్ఞులకు ఇది ధర్మ శాస్త్రం. అధ్యాత్మ విదులకు వేదాంతం, నీతివేత్తలకిది నీతి శాస్త్రము. కవులకు మహాకావ్యం. పౌరాణికులకు పురాణం. ఇందులో లేని ధర్మాలు, నీతులు లేవు. శ్రీకృష్ణ పరమాత్ముడు అర్జును నికి బోధించిన "భగవద్గీత" ఇందులోదే. ఆ "భగవద్గీత" విన్నతరువాతనే అర్జు నుడు మళ్ళీ మనస్సులో ధైర్యం తెచ్చుకొని కౌరవులతో యుద్ధం చేయడానికి సిద్ధపడినాడు.



దాశరథి, నారాయణరెడ్డి.

కౌరవులూ పాండవులూ నిజానికి అన్నదమ్ములు. ధృతరాష్ట్రుని కుమారులు కౌరవులు; పాండురాజు కుమారులు పాండవులు. కౌరవులు నూరుగురు, పాండవులు

అయిదుగురు. ఈ అయిదుగురినీ పంచపాండవులు అంటారు. అయితే దుర్మార్గుల వలన పాండురాజు మరణించాడు. ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు. అన్నదమ్ముల రాజ్యం పంపకములో కలహం వచ్చింది. అదే కురుక్షేత్ర యుద్ధంగా మారింది. అయితే న్యాయం పాండవుల పక్షాన వున్నది. కనుక సాక్షాత్తు విష్ణువైన శ్రీకృష్ణుడు పాండవుల పక్షాన నిలచినాడు. అర్జునుని రథానికి సారథి అయినాడు. చివరకు పాండవులకే విజయం లభించింది. ఇదొక చిత్రమైన కథ. పిల్లలకు తెలిసే రీతిగా భారతాన్ని మేము వ్రాసినాము. చదివి ఆనందించండి. దీనిని చక్కని కాగితముపై అందమైన బొమ్మలతో, ముద్దుగా ప్రచురించిన శ్రీ కొండా శంకరయ్యా పుస్తకముల వ్యాపారము వారికి కృతజ్ఞులం.

ఇట్లు
రచయితలు



చిత్రం....
శ్రీ బి. పైడిరాజు: (రాజమండ్రి)




# ప్రస్తావన

పంచ పాండవులలో మూడవవాడు మహావీరుడైన అర్జునుడు. అతని కుమారుడు అభిమన్యుడు. అభిమన్యునికీ ఉత్తరకూ ధర్మమూర్తియైన పరీక్షిత్తు జన్మించెను. అతడు అరవైయేండ్లు ధర్మ మార్గంలో రాజ్యం చేసినాడు. ఇతర రాజులంతా ఆయన చెప్పినట్లల్లా వింటూ ఉండేవారు పరీక్షిత్తును వేట అంటే చాలా ఇష్టం.

ఒకనాడు పరీక్షిత్తు వేటకోసం అడవికి వెళ్ళినాడు. చాలా మృగాలను చంపినాడు. చివరకు ఒక మృగం పరీక్షిత్తు బాణం దెబ్బతిని చావకుండానే పారిపోయింది. అది ఎటు పారిపోయిందో చూడటానికీ, దాన్ని పట్టుకోటానికీ పరీక్షిత్తు అరణ్యంలో అటూ ఇటూ పరిగెత్తడం మొదలుపెట్టినాడు. ఆ మృగం పారిపోయిన జాడ చెప్పటానికి ఆ అడవిలో ఎవ్వరూ లేరు. అది కీకారణ్యం. అయితే కొంత దూరము పరుగెత్తి మృగం కనపడకపోవడంవల్ల అలసిపోయి ఇక పరుగెత్తలేక ఒక చెట్టుకిందికి చేరుకున్నాడు. ఆ చెట్టుక్రింద తపస్సు చేసుకుంటున్న ఒక ఋషి కనిపించాడు. కండ్లు ఎన్నాళ్ళక్రింద మూసుకున్నాడో గాని రెప్పలు తెరవరానంతగా ముక్కో పోయినై. శరీరమంతా శుష్కించి ఉన్నది.

ఆ మునిని కనుక్కుంటే మృగం ఎటుపోయిందీ చెబుతాడనుకున్నాడు పరీక్షిత్తు. మునీశ్వరుడి దగ్గరగా వెళ్లి "స్వామీ! నా బాణం దెబ్బతిని చావకుండా పారిపోయినమృగం ఇటువచ్చిందా" అని అడిగాడు. మునీశ్వరుడు మాట్లాడలేదు.



పరీక్షిత్తు శమీకుని మెడలో పామును వేయుట

సరిగదా కొంచెమైనా కదలకుండా ధ్యానంలో మునిగివున్నాడు. "ఏమండీ! మిమ్మల్నే" అని మళ్ళీ గట్టిగా పలకరించినాడు. ఈమాటు కూడా ముని మాట్లాడలేదు. ఇంతగా పిలిచినా మునీశ్వరుడు మాట్లాడకపోవడం పరీక్షిత్తుకు బాగ కనిపించలేదు. పైగా కోపముకూడా వచ్చింది. కోపంలో మంచీ చెడూ మరచి అక్క-

డికి సమీపంలో చచ్చిపడివున్న ఒక పామును తీసుకోవచ్చి ఆ ముని మెడలోవేసి తన దారిన తాను వెళ్ళిపోయినాడు. ఆ ముని శమీకుడు. గొప్ప తపస్సంపన్నుడు. ఎవరికి ఎట్టి అపకారం చేసేవాడు కాదు. ఎప్పుడూ ధ్యానంలో వుండేవాడు గనుక తనదగ్గరకు ఎవరు వచ్చిందీ గమనించేవాడుకాదు.

పరీక్షిత్తు వెళ్ళిపోగానే ఈ శమీక మహాముని కొడుకు శృంగి స్నానం చేసుకుని తన తండ్రి కూర్చున్న చోటికి వచ్చినాడు. తీరా చూసేవరకు తండ్రిమెడలో చచ్చిన పాముకటి వ్రేలాడుతున్నది. "ఎవరురా నా తండ్రి మెడలో చచ్చినపాము వేసింది" అని కోపంతో గర్జించినాడు. కృశుడనే ఒక ముని అదివిని "నీ తండ్రి మెడలో పామును వేసినవాడు పరీక్షిత్తు అనే రాజు. నేను దూరాననుండి చూస్తుండగా పామును నీతండ్రి మెడలో వేసి నేను వద్దంటున్నా వినకుండా ఆయన్ను అవమానించి వెళ్ళిపోయినాడు" అని చెప్పినాడు. అది విని శృంగి మరీ ఉగ్రుడై పోయినాడు. "ఎవ్వరికిని ఎట్టి అపకారం చేయకుండా, అరణ్యంలో కూచుని తపస్సు చేసుకునే శాంతమూర్తియైన నా తండ్రిని ఇలా అవమానించిన పరీక్షిత్తు నేటినుండి యేడు రోజులలో తక్షకుడనే పాము కరచి ఆ విషంవల్ల నరకానికి పోవుగాక" అని శాపం పెట్టినాడు.

ఈ వార్త పరీక్షిత్తునకు తెలిసింది. చాలా భయపడినాడు. తాను వెనకా ముందులు ఆలోచించకుండా శమీక మహాముని మెడలో సర్పం వేయడం గొప్ప తప్పిదమని గుర్తించినాడు. అయితే జరిగిందేదో జరిగిపోయింది గనుక ఇప్పుడు తక్షకుని తప్పించుకోవడానికి మార్గం ఆలోచించినాడు. ఒక పెద్ద ఒంటి స్తంభం మేడ కట్టించినాడు. దానిలో పైభాగాన ఒక గదిలో కూర్చున్నాడు. తక్షకుని విషాన్ని విరుగగొట్టగల మంత్రాలు, తంత్రాలు, మందులు తెలిసిన మాంత్రికులను, వైద్యులను చుట్టూ కూర్చోబెట్టుకున్నాడు. ఎవ్వణ్ణీ తన బంగళాలోకి రానీ

యకుండా అనేక భటులను చుట్టూ కాపలా పెట్టినాడు. ఆ భటులు రాత్రి పగలూ అని లేకుండా నిద్రా, ఆహారం మానుకుని చాలాజాగ్రత్తగా కాపలా



పరీక్షిత్తు ఒంటి స్తంభపు మేడపైనుండి పురాణాలు వినుట

## మొక్కవోని ముని శాపం

ఇంత కాపలా వుండగా సర్పరూపంలో వెళ్ళడం సాధ్యం కాదని గుర్తించి తక్షకుడు ఒక ఎత్తువేసినాడు. తన అనుచరులైన నాగకుమారులందరికీ బ్రాహ్మణ రూపాలను సృష్టించినాడు. వారికి సువాసనలు చిమ్మే పూలు, తీయని పండ్లూ బుట్టల

నిండా నింపితెచ్చి ఇచ్చి పరీక్షిత్తువద్దకు పొమ్మన్నాడు. తానుగూడా వారి వెంటనే అదృశ్యరూపంలో బయలుదేరినాడు. నాగకుమారులంతా బ్రాహ్మణ వేషాలతో, వేదమంత్రాలు పఠించుతూ పరీక్షిత్తు ఒంటిస్తంభం మేడవద్దకు పోయినారు. అది చూచి చాలా సంతోషించి పరీక్షిత్తు వారి నందరినీ ఆహ్వానించి వారు ఇచ్చిన పూలూ, పండ్లూ తీసుకున్నాడు. భక్తితో వారి నందరినీ పూజించినాడు.



తక్షకుడు అదృశ్య రూపములో పరీక్షిత్తును కరచుట

సరీగా ఆనాటికి శాపదినం ముగుస్తున్నది. చీకటి పడింది. తెల్లవారితే ఇక ప్రమాదం తప్పినట్లే. పరీక్షిత్తుకూ మంత్రులకూ చాలా వరకు భయం పోయింది.

బ్రాహ్మణ రూపాల్లో వున్న నాగకుమారులు తెచ్చి యిచ్చిన రకరకాల పండ్లను పరీక్షిత్తు తన మంత్రులందరికీ ఇచ్చి తానుగూడా ఒక పండు తీసుకున్నాడు. పెద్దలు తెచ్చి ఇచ్చిన ఫలం తినడం మంచిదని భావించి ఆ పండును రెండు ముక్కలుగా విరిచినాడు. విరవగానే అందులో ఒక నల్లని పురుగు కనిపించింది. అంతలో అది లత్తుకరంగు గల పామై లేచింది. పరీక్షిత్తు ఆశ్చర్యపడి చూస్తుం డగానే ఆపాము పరీక్షిత్తుమీద దూకి కాటువేసింది. ఆ పామే తక్షకుడు. తక్షకుడు కరచినప్పుడు విడిచిన విషాగ్నిలో పరీక్షిత్తుతోపాటు ఒంటిస్తంభం మేడంతా కాలి భస్మమైపోయింది.





# సర్పయాగం

అప్పటికే పరీక్షిత్తుకు ఒక కొడుకున్నాడు. అతని పేరు జనమేజయుడు. అయితే తన తండ్రి చనిపోయే టప్పటికి అతడు చాలా చిన్నవాడు. పెద్దవాడైనాక జనమేజయునికి తన తండ్రి చనిపోయిన కారణం వివరంగా తెలిసింది. తక్షకుడు తన తండ్రిని చంపినందుకు చాలా కోపంవచ్చింది. తక్షకునిమీదికోపం క్రమంగా పాము లన్నిటిమీద వ్యాపించింది. అసలు ప్రపంచంలో పాములే లేకుండా చేయాలని నిశ్చయించుకున్నాడు జనమేజయుడు. ఋషులను, బ్రాహ్మణులను ఆలోచించి గొప్ప సర్పయాగం చేసినాడు. ఆ యజ్ఞానికి చండభార్గవుడు హోతగా నియమించబడినాడు. బాగా అనుభవం గడించిన పెద్దలు ఎందరో సర్పయాగం పనిలో భాగం పంచుకున్నారు. పెద్ద హోమకుండం తయారుచేసినారు. అందులో మంట ఆకాశానికి అంటే అంతపెద్దగా మండుతున్నది. చుట్టూ నీలిరంగు గుడ్డలు కప్పుకొని పొగవలన ఎఱ్ఱబడిన కండ్లతో మహామునులు కూచుని మంత్రాలు చదువుతున్నారు. ఆ పొగకూ, మంత్రాలకూ పాములు మూర్ఛపోయి కొట్టుకొచ్చి వేలకు వేలు హోమకుండంలోపడి మాడిపోతున్నవి. తెల్లటి పాములూ, నల్లటిపాములూ,

నెత్తురురంగుగల పాములూ, ఒకతల పాములూ, మూడు, అయిదు, ఏడు, తొమ్మిది తలల పాములూ వచ్చి కుండంలో పడి చచ్చిపోతున్నవి.

## తల్లడిల్లిన తక్షకుడు

ఇదంతా విని తక్షకుడు గజగజ వణకిపోయినాడు. తానుకూడా మంటల్లో మాడిపోవలసిన సమయం దాపురించి నందుకు దుఃఖించినాడు. ఆలస్యంచేస్తే లాభంలేదని పరుగెత్తుకొని వెళ్ళి ఇంద్రుని పాదాలు పట్టుకున్నాడు. రక్షింప వలసిందిగా వేడుకున్నాడు. వాసుకి అనే మరో సర్పం ఆస్తీకుడు అనే మహామునిని ఆశ్రయించినాడు. ఎట్లాగైనా తమ ప్రాణాలు కాపాడటమే కాకుండా తమ సర్ప కులాన్ని కాపాడవలసిందిగా ప్రతిమాలుకున్నాడు. ఆస్తీక మహామునికి దయ కలిగింది. తప్పకుండా సర్పకులాన్ని రక్షిస్తానని వాగ్దానం చేసినాడు. తన శిష్యు లతో గూడా సర్పయాగం జరిగే స్థలానికి వచ్చినాడు.

## ఆస్తీకుని ఆగమనం

సర్పయాగం బ్రహ్మాండంగా జరుగుతున్నది. ఆ యజ్ఞాన్ని ఆస్తీకుడు మెచ్చుకున్నాడు. ఆ యజ్ఞాన్ని నిర్వహిస్తున్న జనమేజయ మహారాజును కీర్తించి నాడు. వెనుక నలుడు చేసిన యజ్ఞము, ధర్మరాజు చేసిన రాజసూయ యజ్ఞము, మున్నగు గొప్ప యజ్ఞాలతో ఈ యజ్ఞం పోలగలదని అన్నాడు. జనమేజయుడు మరి అతని యజ్ఞంలో పాల్గొంటున్న మునులూ ఆస్తీకునికి ప్రీతులైనారు. జనమే జయుడు ఆస్తీకునితో "మునీంద్రా ! మీవంటి మహానుభావుడు ఏదికోరితే అది ఇచ్చి ధన్యుణ్ణి కాదలచినాను. నీకు ఏమి కావలెనో సెలవిమ్ము" అన్నాడు. ఇదే మంచి సమయమని భావించి ఆస్తీకుడు "జనమేజయ మహారాజా ! నాకోరిక తీరుస్తానన్నావు. అయితే అడుగుతున్నాను విను. చేస్తున్న ఈ సర్పయాగం

మానుకో. సర్పజాతికి ప్రాణభిక్ష పెట్టు" అన్నాడు. సదస్యులంతా కూడా ఆస్తీకుని కోర్కె తీర్చుమని జనమేజయుని కోరినారు. జనమేజయుడు కాదనలేక పోయినాడు. సర్పయాగాన్ని ఉపసంహరించుకున్నాడు.



జనమేజయుని సర్పయాగము వద్దకు ఆస్తీకుని ఆగమనం

## వ్యాస మునీంద్రుని రాక

సర్పయాగాన్ని ఉపసంహరించిన పిమ్మట జనమేజయుడు మునులకు, బ్రాహ్మణులకు, దీనులకు, అనాధులకు కోరిన ధనము లిచ్చినాడు. తరువాత ఆయనకు అనేక పురాణ పుణ్య కథలు వినాలనే కోరిక కలిగింది. పండితులను సమావేశ పరచినాడు. ఆ సమావేశమునకు జింకచర్మం ధరించి, నల్లని మేఘం

లాంటి దేహంతో, సూర్య కిరణాలవలె వున్న జటలతో వ్యాసమహాముని వచ్చినాడు. ఆయన వెంట వైశంపాయనుడు మొదలగు ఆయన శిష్యులు వచ్చినారు. జనమేజయుడు వ్యాసున్ని రత్నాల సింహాసనంమీద కూర్చుండబెట్టి ఘనంగా పూజించినాడు. ఆ తరువాత ఆయన వ్యాస మహామునితో ఇలా అన్నాడు: స్వామీ! మీరు రాజ్యాన్ని చక్కగా పంచి ఇచ్చినప్పటికీ, ఎవరి పని వారు చూచుకుంటూ



జనమేజయుని కొలువు కూటమునకు వ్యాస మునీంద్రుని రాక

సుఖంగా వుండక కౌరవులూ, పాండవులూ ఎందుకోసం యుద్ధము చేసినారు? పోనీ మీరైనా ఆ యుద్ధాన్ని ఎందుకు మాన్పించలేదు? అసలు ఈ కుంటుబ కలహం ఎలా వచ్చింది? మీరు కౌరవులకు, పాండవులకు పితామహులు కనుక మిమ్మల్ని ఈ వివరాలన్నీ చెప్పవలసిందిగా ప్రార్థిస్తున్నాను."

# కథ చెప్పిన వైశంపాయనుడు

అది విని వ్యాసుడు జనమేజయుని కోర్కెకు సంతోషించినాడు. తనకు చాలా పనులుండటంవల్ల తన శిష్యుడైన వైశంపాయనునికి శ్రీ మహాభారత కథ



**జనమేజయునకు భారత కథను వినిపించుచున్న వైశంపాయనుడు.**

చెప్పవలసిందిగా ఆదేశించి తాను వెళ్ళిపోయినాడు. సర్వలోక పూజ్యమైన భారత కథను వైశంపాయనుడు జనమేజయ మహారాజుకు సవిస్తరంగా చెప్పసాగినాడు.

వినుడు పంచమ వేదమూ

మీలోన

వెల్లి విరియును మోదము॥

ఒకకోటి యాగాల నొనరించినా
సకల తీర్థాలలో చరియించినా
పొందజాలని ఫలము నందుకొందురు మీరు
భారతమ్మొకమారు పఠియించినా ॥వినుడు॥

కవులకిది ఒక దివ్యకావ్యము
భక్తులకు నిదియే పురాణము
ధర్మ శాస్త్రమ్మిదే నీతి శాస్త్రమ్మిదే
మన జాతిసంస్కృతికి మణిదర్పణమ్మిదే
వినుడు పంచమ వేదమూ

మీలోన

వెల్లి విరియును మోదము॥




చంద్రవంశములో దుష్యంతుడనే మహారాజు ఉండెను. అతనికి శకుంతల వలన ఒక కుమారుడు కలిగినాడు. అతని పేరు భరతుడు. అతడు మహావీరుడు. పసితనంలోనే సింహాలతో పోరాడి వాటిని చంపినవాడు. అతడు పరిపాలించిన దేశానికే భారతదేశం అనే శాశ్వత నామం ఏర్పడింది. భరతుని వంశంలో శంతనుడు అనేవాడు పుట్టినాడు. అతడు పెద్దవాడైన తరువాత అతనితండ్రి రాజ్యభారం అంతా అప్పగించి అడవికిపోయి తపస్సు చేసుకోసాగినాడు. శంతనుడు చక్కగా రాజ్యపాలనం సాగించినాడు.

ఒకనాడు శంతనుడు విల్లు అమ్ములు తీసుకుని వేటకోసం అడవికి వెళ్ళినాడు. అటునుంచి గంగానదీ తీరాన్ని చేరుకున్నాడు. అలసటగా ఉండడంవల్ల ఇసుకలో కాస్తసేపు విశ్రమించినాడు. అంతలో అక్కడికి సమీపంలో ఒక అందమైన అమ్మాయి రత్నాల హారాలతో, ఖరీదైన జరీచీరెతో అక్కడ విహరిస్తూ కనిపించింది. చాలా అందంగావున్న ఆ కన్యనుచూచి శంతనుడు ఆశ్చర్యపడ్డాడు. ఇది వనకన్యయో, రాక్షసకన్యయో, నాగకన్యయో, దేవకన్యయో కావచ్చును. లేకుంటే మానవ కన్య ఒంటరిగా ఈ అరణ్యంలో ఈ నది ఒడ్డున ఎలా తిరుగుతుంటుంది అనుకున్నాడు. ఆమెకూడా శంతనుణ్ణి చూచింది. శంతనుడు

కూడా అందమైనవాడే. ఆమెకుకూడా అతనిపై అనురాగం కలిగింది. ఇద్దరూ ఒకరి నొకరు బాగా చూచుకున్నారు. దగ్గరగా వచ్చినారు. “నీవెవ్వరవు” అని శంతనుడు ఆమెను అడిగినాడు. ఆమె “నేను ఎవతెనైతే నీకేమి? నన్ను పెళ్ళి




శంతనుడు నదిఒడ్డున గంగాదేవినిచూచి మోహించుట.

చేసుకోవాలనివుంటే నాషరతుఒకటి ఒప్పుకో. నేను నీకు భార్యనవుతాను” అన్నది. అది విని శంతనునికి చాలా ఆనందం కలిగింది. “సరే. ఆ షరతు ఏమిటోచెప్పు” అన్నాడు. “నేను ఏదిచేసినా కాదనకుండా ఊరుకోవాలి. నీవు నా ఏ పనికీ అడ్డు

రాగూడదు. అడ్డువస్తే తక్షణం నిన్ను విడిచి వెళ్లిపోతాను'' అన్నది గంగ. ''ఇదెంతపని. అలాగే నీకు అడ్డురాను'' అన్నాడు శంతనుడు. ఆమె శంతనుణ్ణి పెళ్ళి చేసుకుంది.

ఆ తరువాత ఆమెకు ఏడుగురు కొడుకులు పుట్టినారు. పుట్టినవాణ్ణి పుట్టినట్టు ఎత్తుకోపోయి గంగలో పారవేసింది రత్నాల్లాంటి పిల్లవాళ్ళని ఏడుగురిని దయా దాక్షిణ్యం లేకుండా గంగలో పారేస్తున్నా తన భార్యను శంతనుడు ఏమీ అనలేక పోయినాడు. అడ్డువస్తే ఎక్కడ కోపగించుకొని వెళ్ళిపోతుందో అని భయపడ్డాడు.

## నరకన్యయైన సురగంగ

కొన్నాళ్ళ తరువాత ఎనిమిదో కొడుకు పుట్టినాడు. అతన్నిగూడా గంగలో పారేయడానికి తీసుకుపోవడం చూచినాడు శంతనుడు. మనస్సు చాలా బాధపడింది. ఏమైనాసరే ఇక అడ్డగించవలసిందే అనుకున్నాడు. ''ఓసీ దయలేనిదానా ! కడుపున పుట్టిన ఏడుగురు రత్నాలవంటి పిల్లలను గంగపాలు చేసినావు. ఇప్పుడీ ఎనిమిదో వాణ్ణికూడా ఏట్లో పారేతామని చూస్తున్నావు. ఏమైనాసరే ఈపిల్లవాణ్ణి నీకివ్వను'' అని కటువుగా మాట్లాడినాడు శంతనుడు. ''నీవు నా పనికి అడ్డువచ్చినావు గనుక ఇక నేను నీవద్ద వుండజాలను. వెళ్లిపోతాను'' అన్నది ఆమె. ఇంకా ఇలా అన్నది: ''నే నెవ్వరినో నీకు తెలియదు. నేను గంగను. వసిష్ఠమహాముని శాపం వలన అష్టవసువులు మన కడుపున పుట్టినారు. ఏడుగురిని గంగలో పారవేయడం వల్ల వాళ్ళకు ముక్తి కలిగింది. ఎనిమిదోవాడు భూలోకంలో దీర్ఘాయుష్మంతుడై వుంటాడు.'' శంతనునికి తన భార్య గంగ అని తెలిసి చాలాఆశ్చర్యం కలిగింది. జగత్పావనియైన గంగను వీడి ఉండలేక ''నీవు పోవలదు'' అని బ్రతిమాలినాడు. కాని ఆమె వినలేదు. వెళ్ళిపోయింది. అయితే ఎనిమిదవ పిల్లవాణ్ణి చంపలేదు. అతనిపేరు దేవవ్రతుడు.

# చంచలించిన శంతనుడు

దేవవ్రతుడు పెద్దవాడై, అన్ని విద్యలూనేర్చి వసిష్ఠునితో, బృహస్పతితో పరశురామునితో, సనత్కుమారునితో సమానుడైనాడు. దేవవ్రతున్ని శంతనుడు యువరాజునుగా చేసినాడు. సమర్థుడైన దేవవ్రతుడు తండ్రికి చేదోడు వాదోడుగా రాజ్యకార్యాలు నిర్వహించుతున్నాడు. శంతనునికి కొంత విశ్రాంతి లభించింది.

ఒకనాడు శంతనుడు మృగయా వినోదం కోసం వెళ్ళివస్తూ యమునానది ఒడ్డున కొంతసేపు సేద దీర్చుకోడానికి ఆగినాడు. యమున ఒడ్డుకు చేరగానే అతనికి ఎన్నడూ ఎరుగని పరిమళం వచ్చింది. ఆ పరిమళం వస్తున్నదారినే కొంత దూరము పోగానే అతనికి పడవ నడుపుతున్న ఒక అందమైన బోయవాళ్ళ పిల్ల కనిపించింది. బోయవాళ్ళలో ఇంత అందమైనపిల్లలుంటారా అనుకున్నాడు శంతనుడు. దగ్గరగా వెళ్లినాడు. "నీ వెవ్వరు? నీ పేరు ఏమిటి" అని అడిగినాడు. "నాపేరు సత్యవతి. నేను దాశరాజు కూతురును" అన్నది. శంతనునికి సత్యవతిని పెళ్లిచేసుకోవాలనిపించింది. అంత అందమైన పిల్ల ఎవతె అయినా సరే పెళ్లి చేసుకోవలసిందే. అనుకున్నాడు. అయితే ఆమె తండ్రిని కలిసి అతన్ని ఎలాగైనా ఒప్పించడం బాగుంటుందనుకున్నాడు. వెంటనే దాశరాజువద్దకు వెళ్లినాడు. శంతన మహారాజును చూడగానే దాశరాజుకు ఆశ్చర్యం వేసింది. ఎన్నడూ అటు వైపు రాని మహారాజు అనుకోకుండా తన యింటికి రావడం చూచి ఆయనను గొప్పగా సత్కరించినాడు. శంతనుడు దాశరాజును ఉద్దేశించి "నీ కూతురైన సత్యవతిని నేను వివాహం చేసుకోడానికి నిశ్చయించుకున్నాను. నీవు అందుకు సమ్మతించవలెను" అన్నాడు. దాశరాజు అందుకు సంతసించి "మహారాజులైన మీరు మాపైగల ఆదరంతో ఉచ్చనీచము లెంచక ఎంతో ఉదారంగా నా కూతురును వివాహ మాడుతామన్నారు. నేను ధన్యుణ్ణి అయినాను. నా కూతురును ఇచ్చి

వివాహం చేయడంలో నాకు ఎట్టి అభ్యంతరంలేదు. అయితే మనసులో వున్న ఒక్కమాట వెనుకాడకుండా చెబుతాను. మీకు నా కూతురును పెళ్లి చేసుకోవాలని వుంటే ఒక షరతు ఒప్పుకోండి. మీరు సత్యవతి వలన కలిగిన కుమారుడు మీ తరువాత రాజుకావలెను. ఈ కోర్కె మన్నించితే ఇప్పుడే సత్యవతిని మీకిచ్చి



శంతనుడు దాశరాజు యింటికివచ్చి సత్యవతినిచ్చి వివాహము చేయుమని అడుగుట

వివాహం జరిపిస్తాను'' అన్నాడు. దాశరాజు మాటలు శంతనునికి ఈటెపోటుల్లా తగిలినవి. సర్వసమర్థుడైన దేవవ్రతుడు యువరాజుగా ఇప్పుడే వ్యవహరిస్తున్నాడు. అతడంటే తన కెంతో ప్రీతి. పైగా అతడు జ్యేష్ఠుడు అవుతాడు. అట్టి వానిని కాదని రేపు పుట్టేవాడికి రాజ్యం ఎలా అప్పజెప్పడం అని పరిపరి విధాల

విచారించినాడు. కాని సత్యవతి సౌందర్యం అతన్ని ఊరికే వెన్నాడసాగినది. వెంటనే ఆ షరతును అంగీకరించలేక, సత్యవతిని విడలేక నానాబాధాపడి తుదకు చింతాక్రాంతుడై ఇంటికి వచ్చినాడు.

## భీష్మ ప్రతిజ్ఞ

శంతనుడు ఏదో కారణంగా చాలా విచారంగా వుండడాన్ని దేవవ్రతుడు (ఇతడే భీష్ముడు) గమనించినాడు. తన తండ్రినిచేరి "నాయనా! నీవు విచారపడ వలసింది ఏదీలేదు. నీకు ఏకారణంవల్ల ఈ చింతగలిగిందో చెప్పు. నేను ఆచింతను పోగొట్టడానికి ప్రయత్నిస్తాను" అన్నాడు. శంతనుడు తన కుమారుని మాటలకు సంతసించి "నాయనా! నీకు నాపైగల పితృప్రేమ గొప్పది. నా విచారానికి కారణం ఏమిటంటే, ఒక్కకొడుకుండడం ఇంచుమించు కొడుకులు లేకపోవడంలోనే జమ అవుతుంది. కనుక బహుపుత్రులను కనవలెను. అందుకోసం మళ్ళీ వివాహం చేసుకోవలెను. నాకు నచ్చిన ఒక కన్య సత్యవతి అనేపేరుగలది వున్నది. కాని ఆమె తండ్రి ఆమెకు నావల్లకలిగిన పుత్రుడే నాతరువాత రాజు కావాలి గాని నీవు రాజువు కావటానికి వీలులేదని షరతు పెట్టినాడు. నిన్ను కాదని ఎలా ఒరులకు రాజ్యం అప్పజెప్పను?" అన్నాడు శంతనుడు. దేవవ్రతునికి తండ్రి సౌఖ్యం కన్న కావలసింది ఏమీ లేదనిపించింది. "తండ్రీ! పరవాలేదు. సత్యవతీ పుత్రుడే రాజు అవుతాడు. నాకు రాజ్యం అక్కరలేదు. నేను ఇప్పుడే వెళ్లి సత్యవతితో నీ వివాహం జరిపిస్తాను" అన్నాడు దేవవ్రతుడు. వెంటనే దాశరాజు వద్దకు వెళ్ళి తనతండ్రి తరఫున దాశరాజు షరతును ఒప్పుకున్నాడు. అందుకు దాశరాజు చాలా సంతోషించినాడు. కాని తనకుగల ఒకసందేహాన్ని ఇలా వెలిబుచ్చినాడు. "దేవవ్రతా! నీవున్నన్నాళ్లు ఈ షరతు నెగ్గుతుంది. కాని నీతరువాత నీకొడుకులు సత్యవతీసంతానాన్ని కాదని తాము రాజ్యాన్ని లాక్కోవచ్చు. ఆ ప్రమాదం తప్పే

మార్గం ఏమిటి?" అందుకు దేవవ్రతుడు వెంటనే యిలా అన్నాడు. "ఆ ప్రమాదం రాకుండా నేనుచేస్తాను. జీవితాంతం నేను బ్రహ్మచారిగా వుంటాను. ఇదే నా శప



దేవవ్రతుని భీష్మ ప్రతిజ్ఞకు దేవతలు మునులు సంతసించుట

థము" అనినాడు. దాశరాజు చాలాసంతోషించి వెంటనే సత్యవతిని శంతనుని కిచ్చి వివాహం చేసినాడు. తన తండ్రి కొరకు బ్రహ్మచర్య వ్రతమును పరిగ్రహించిన దేవవ్రతున్ని దేవతలూ, ఋషులూ మెచ్చుకున్నారు. అతన్ని భీష్ముడని పొగడినారు.

# శంతనుని సంతానం

శంతన మహారాజుకు సత్యవతివలన ఇద్దరుకుమారులు కలిగినారు. వాళ్లు చిత్రాంగదుడూ, విచిత్రవీర్యుడూ అనువారు. ఆ ఇద్దరి పిల్లల చిన్నతనంలోనే శంతనుడు చనిపోయినాడు. వాగ్దానం చేసిన ప్రకారం భీష్ముడు ఆ ఇరువురిలో పెద్దవాడైన చిత్రాంగదునికి రాజ్యాభిషేకం చేసినాడు. అతనిపక్షాన తానే రాజ్యకార్యాలు నిర్వహిస్తున్నాడు.



చిత్రాంగదుడు గంధర్వునితో పోరి మరణించుట

చిత్రాంగదుడు చాలాగర్వి. తన బలంముందు మరెవ్వరిబలమూ చాలదనుకునేవాడు. ఎవడితోపడితే వాడితో,ఎప్పుడుపడితే అప్పుడు యుద్ధానికి సిద్ధపడేవాడు.

దేవతలు, దానవులు, మానవులు అను భేదంలేకుండా ప్రతివానిని నిందించేవాడు. ఇతని దుష్టప్రవర్తనకు కోపగించి ఒక గంధర్వుడు చిత్రాంగదుని మీదికి యుద్ధానికి వచ్చినాడు. వాడిపేరూ చిత్రాంగదుడే. ఇద్దరూ బలంగలవాళ్ళే. అయితో గంధర్వుడైన చిత్రాంగదుడు మాయా యుద్ధం తెలిసినవాడు. కనుక మాయచేసి చిత్రాంగదున్ని ఓడించి చంపివేసినాడు.

## పరమపదించిన ఇరువురు పుత్రులు

చిత్రాంగదుడు చనిపోగానే అతని తమ్ముడైన విచిత్రవీర్యునికి భీష్ముడు పట్టాభిషేకం చేసినాడు. కాశీరాజు కూతుళ్ళైన అంబిక అంబాలికలను విచిత్రవీర్యునికి వివాహం చేసినాడు. అయితే విచిత్రవీర్యుడు భోగలాలసుడై, కామపరవశుడై రాజ్యాన్ని రాజకార్యాలను విడిచి అందమైన తన భార్యలతో రేయింబవళ్ళూ క్రీడిస్తూ క్షయవ్యాధిపాలై, క్షీణించి చనిపోయినాడు.

## భీ ష్ము ని ఓ దా ర్పు

ఇద్దరు తమ్ములూ చనిపోవడంవల్ల దుఃఖంతో కుమిలిపోతున్న తన పిన తల్లినీ మరదండ్లనూ శాంతపరచుతూ భీష్ముడు రాజ్యాన్ని నిర్వహిస్తూ వున్నాడు.

## వంశాన్ని ఉద్ధరించాలి

దురాశతో దాశరాజు పెట్టిన షరతు భారతదేశానికే ప్రమాదాన్ని తెచ్చిపెట్టింది. భారత వంశమే అంతరించినట్లైంది. భీష్ముడు బ్రహ్మచర్య వ్రత దీక్ష పూనినాడు. సత్యవతీ కుమారులు మరణించినారు. ఇక భవిష్యత్తున కురువంశమే లేదు. ఇదిచూచి సత్యవతి చాలా దిగులుచెందినది. తన తండ్రి దుశ్చర్యను చాలా నిందించింది. తన దురదృష్టానికి ఏడ్చింది. ఒకనాడు భీష్మున్ని సమీపించి "నీవొక్కడవే ఇక మన వంశానికి ఆధారంగా మిగిలినావు. నీవు వివాహం చేసుకోకుండా బ్రహ్మచారిగా ఉంటే నీతో మనవంశం అంతమైపోతున్నది. కనుక మన

వంశక్షేమం కోసం, పితృపితామహుల ముక్తికోసం దేశంకోసం నీవు గడచిన దానిని మరచి వివాహం చేసుకో. సంతానాన్ని పొంది మనవంశాన్ని ఉద్ధరించు" అని మొరపెట్టుకున్నది. ఆ మాటలకు భీష్ముడు నొచ్చుకున్నాడు. "తల్లీ! వంశం క్షయం అయిపోయినా సరేగాని నేను నామాటదప్పను. జీవితాంతం వివాహమాడనని శపథం చేసిన నేను ఇప్పుడు ఎలా పెండ్లిఆడను? ఇది ధర్మమౌతుందా?" అన్నాడు. ఇంకా ఇలా అన్నాడు: "అయితే నేను వివాహం చేసుకోక పోయినంత మాత్రాన వంశక్షయం అవుతుంటే చూచి ఉండలేను. ఇందుకు ఏదైనా మార్గం వెదకుదాం. నాకు ప్రస్తుతం తోస్తున్న దేమిటంటే వెనుక పరశురాముడు క్షత్రియ వంశాలన్నిటినీ నాశనం చేసినాడు. ఆ సందర్భంలో క్షత్రియకాంతలు బ్రాహ్మణులవలన సంతానం పొందినారు. తద్ద్వారా వంశాలను కాపాడుకున్నారు. కనుక మనం గూడా అట్టి మార్గాన్ని దేన్నైనా అవలంబిస్తే బాగుంటుంది. అయినా నీవు ఆలోచించు. పెద్దలతోగూడా ఆలోచించిచూడు."

## సంయమిద్వారా సంతాన దానము

భీష్ముని సలహా సత్యవతికి నచ్చింది. అయితే ఎవరిద్వారా తన కోడండ్లకు పుత్రదానం చేయించాలని ఆలోచించింది. చిన్నతనంలో తనకూ పరాశర మహర్షికీ జనించిన వ్యాసమహాముని జ్ఞాపకం వచ్చినాడు. తన కన్యాత్వం చెడకుండా తాను కనిన వ్యాసుడు తనకు కుమారుడే కనుక అతనిచేత తన కోడండ్రకు పుత్రదానం చేయించడం బాగుంటుందని నిశ్చయించుకుంది. వేదవ్యాసున్ని గూర్చి

తల్లియగు సత్యవతి తలచుకునేసరికి ఆయన వచ్చి ప్రత్యక్షమైనాడు. "నీవు నా తల్లివి. నీకు ఏమి కావలెను" అని వ్యాసఋషి అడిగినాడు. సత్యవతి తన ఇరువురి కుమారుల మరణం, వంశక్షయం అయ్యే ప్రమాదం అంతా చెప్పింది.



సత్యవతి తన కుమారుడగు వ్యాసునితో మాట్లాడుట

వ్యాసుడు తన మరదండ్లైన అంబిక, అంబాలికలకు సంతాన దానం చేసినాడు. అయితే రాణులైన అంబిక, అంబాలికలు ఋషి అయిన వ్యాసుని వికారరూపాన్ని చూచి మనసులో హేయభావం కలిగిఉండడంవల్ల అంబికకు గ్రుడ్డివాడైన ధృతరాష్ట్రుడు, అంబాలికకు పాండువర్ణము గల పాండురాజు ఉద్భవించిరి. ఇద్దరి శరీరాలలోనూ లోపం ఉండడంచూచి సత్యవతి విచారపడి ఎట్టిలోపంలేని ఒక

కుమారుని అంబికకు యివ్వవలసిందిగా వ్యాసున్ని కోరింది. కాని అంబిక వ్యాసున్ని ఇష్టపడక తనకు బదులు తన దాసీదాన్ని అలంకరించి వ్యాసునివద్దకు పంపింది. వ్యాసుడు అది గమనించక దాసీని అంబికగా భావించి పుత్రదానం చేసినాడు. తత్కారణంగా ఆ దాసీది విదురుడను మహానుభావుణ్ణి కన్నది. మొత్తంమీద వంశక్షయం తప్పినందుకు అంతా సంతోషించినారు.

## పుత్రి లాభం

ధృతరాష్ట్రుడూ, పాండురాజూ క్రమంగా పెరిగి పెద్దవారైనారు. ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడైనా ఇద్దరిలో పెద్దవాడు. గనుక భీష్ముడు ధృతరాష్ట్రుడికే పట్టాభిషేకం చేసినాడు. చాలామంది గ్రుడ్డివాడికి రాజ్యం ఇవ్వవద్దన్నారు. కాని భీష్ముడు వాళ్ళమాట వినలేదు. భీష్ముడు ధృతరాష్ట్రునికి గాంధారితోను, పాండురాజుకు కుంతితోను వివాహం చేయించినాడు. పాండురాజుకు కుంతి వలన ధర్మరాజు, భీముడు, అర్జునుడు అను ముగ్గురు మహావీరులు జన్మించినారు. పాండురాజు రెండవభార్య మాద్రికి నకుల సహదేవులు అనే ఇద్దరు కొడుకులు ఉదయించినారు. ధృతరాష్ట్రునికి గాంధారివలన దుర్యోధన దుశ్శాసనాదులు నూరుగురు కొడుకులు పుట్టినారు. పాండురాజు కుమారులను పాండవులనీ, ధృతరాష్ట్రుని సంతతిని కౌరవులనీ వాడుకుంటుండేవారు. పాండవులలో కౌరవులలో ధర్మరాజు అందరికంటె పెద్దవాడు.

## కుంతి కోరిన వింత కోరిక

అయితే కుంతి తనకు పెళ్లికాకముందే రహస్యంగా సూర్యభగవానుని యాచించి అతనివలన ఒక కుమారుని కని నదిలో పారవేసింది. లోకాపవాదమును తప్పించుకోడానికి అలా చేయవలసి వచ్చింది. ఆ కుమారుడు నీటిలో కొట్టుకొని



తన కుమారుని నదిలో వదలుటకై వెచ్చు కుంతికుమారి

పోతూ ఒకసూతునికి దొరికినాడు. తేజోవంతుడైన ఆ పిల్లవాణ్ణి సూతుడు ఇంటికి తీసుకొని వెళ్లి తన భార్యయైన రాధకు ఇచ్చినాడు. ఆమె చాలా అల్లారుముద్దుగా ఆ పిల్లవాణ్ణి పెంచినది. అతడే కర్ణుడు.

## పాండురాజు పరమపదించుట

ధృతరాష్ట్రుడు రాజైనప్పటికీ గ్రుడ్డివాడు గనుక అతని పక్షాన తమ్ముడు పాండురాజు రాజ్యాన్ని నిర్వహించ సాగినాడు. కాని తనకు సంతానము కలిగిన

తరువాత కొలది కాలానికే పాండురాజు మరణించినాడు. సమర్థుడైన తమ్ముడు మరణించడంవల్ల ధృతరాష్ట్రుడు రాజ్యపాలనకు సంబంధించిన పనులు భీష్ముడు, విదురుడు తోడ్పడగా తానే మెల్లగా నిర్వహిస్తూ తన పిల్లలనూ, తన తమ్ముని పిల్లలనూ జాగ్రత్తగా పెంచుతూ, విద్యా బుద్ధులు నేర్పుతూ అందరినీ సమానంగా చూస్తూవున్నాడు.

## కురు కుమారుల గురువు

పిల్లలు కాస్త పెద్దవాళ్లై అస్త్రవిద్యను అభ్యసించే స్థితికి రాగానే భీష్ముడు వారికి గురువుగా కృపాచార్యున్ని నియమించినాడు. కృపుని శిక్షణ పొంది, పాండవులు, కౌరవులు ధనుర్విద్యలో ఆరితేరినారు.

## ద్రోణాచార్యుని రాక

ఒకనాడు ద్రోణాచార్యుడను ఒక బ్రాహ్మణుడు తన బాల్యమిత్రుడైన ద్రుపదునివద్దకేగి అతనిచే అవమానింపబడి హస్తినాపురానికి తిరిగి వస్తుండగా ఊరిబయట పాండవులూ, కౌరవులూ బంతి ఆట ఆడుకుంటున్నారు. ఆ బంతివెళ్ళి ఒక లోతుబావిలో పడింది. దాన్ని తీయడానికి పిల్లల్లో ఎవ్వరికీ చేతకాలేదు. ద్రోణుడు అదంతా చూచినాడు. పిల్లల దగ్గరికి వచ్చి ఇలా అన్నాడు: "భరత వంశములో పుట్టినారు. అస్త్రవిద్యలో ఆరితేరిన గురువు శిష్యులు. ఈ బంతిని బావిలోనుంచి తీయలేరా? ఇదుగో నేను బాణ పరంపరతో ఈ బంతిని తీస్తాను. ఈవిద్య ఇంకెవ్వరికీ తెలియదు" అని ఆ బంతిని బాణంతో కొట్టి బాణం వెనక మరో బాణం వేసి గుచ్చి ఆ బాణాల వరుసను ఒక తాడులా తయారుచేసి బంతిని పైకి లాగి పిల్లలకు ఇచ్చివేసినాడు. పిల్లలకు చాలా ఆశ్చర్యం వేసింది. ఇంత గొప్ప విలుకాణ్ణి వారు ఎన్నడూ ఎరుగరు. వారంతా ద్రోణున్ని తమ తాతయగు భీష్ముని వద్దకు తీసుకొని పోయినారు. భీష్ముడు ద్రోణుని

చాకచక్యాన్ని పిల్లలవల్ల విని చాలా సంతోషించి పిల్లలు ద్రోణున్ని గురువుగా నియమించినాడు. ద్రోణుడు కౌరవ పాండవుల నందరినీ ఒక్కచోట సమావేశ



ద్రోణాచార్యులు నూతిలో బడిన బంతిని తీయుట.

పరచి "నేను మీకు గొప్పగా విలువిద్యనేర్పుతాను. అయితే పూర్తిగా నేర్చిన తరువాత మీలో నాఇష్టాన్ని తీర్చగల సమర్థుడెవ్వడు?" అని అడిగినాడు. కౌరవులంతా నిశ్శబ్దంగా ఊరుకున్నారు. పాండవులలోనుండి అర్జునుడు లేచి "నేను నీ అభీష్టమును నెరవేరుస్తాను"అన్నాడు. "భేష్" అని ద్రోణుడు అర్జునున్ని కౌగిలించుకున్నాడు.

## అందరిని మించిన అర్జునుడు

కౌరవ పాండవులతోపాటు ఇతర రాజకుమారులు, వారివెంట కర్ణుడూ ద్రోణునివద్ద విలువిద్య నభ్యసించినారు. కర్ణుడు ఎప్పుడూ అర్జునునికి పోటీగా దుర్యోధనుని పక్షపాతిగా మెలగుతుండేవాడు. ద్రోణునికి అందరిమీదకంటే అర్జునునిమీద ఎక్కువ ప్రేమఉండెడిది. అందుకు కారణం అర్జునుని చురుకుదనము, శిష్యవృత్తి. ఇతరులు ఎవ్వరూ అర్జునుడికంటే విలువిద్యలో అధికులు కాకుండునట్లుగా ద్వంద్వ సంకీర్ణయుద్ధాల పద్ధతులు, రథంమీదినుండి, గుఱ్ఱము, ఏనుగు మున్నగువాని మీదినుండి యుద్ధంచేసే చిత్రమైన రీతులు, రకరకాల వ్యూహాలను భేదించే ఉపాయాలు మొదలైనవన్నీ ద్రోణుడు అర్జునునికి నేర్పినాడు.

## కుమారులు చూపిన అస్త్రవిద్య

వీళ్ళంతా ఎంతవరకు అస్త్రవిద్య నేర్చినారో పెద్దలకుచూపాలనే కోర్కెతో ద్రోణుడు ధృతరాష్ట్రుని అనుమతిపొంది పెద్ద సభ ఏర్పాటుచేసినాడు. ఆ సభకు భీష్ముడు, విదురుడు, కృపుడు, శల్యుడు, శకుని, సోమదత్తుడు మున్నగు పెద్దలంతా వచ్చినారు. పెద్ద ప్రదర్శనరంగం నిర్మించబడింది.

మొదట భీముడు దుర్యోధనుడు తమ గదాయుద్ధం చూపించినారు. ఇద్దరూ రెండు పెద్ద యేనుగులవలె తలపడినాడు. వాళ్ళ కాళ్ళతాపులకు భూమి దద్దరిల్లింది. కొంతసేపు వారు పోరుసల్పినతరువాత అర్జునుడు తన విలువిద్యను చూపించినాడు. ఆగ్నేయాస్త్రంతో అగ్నిని పుట్టించినాడు. వారుణాస్త్రంతో వర్షాన్ని, అనిలబాణంతో గొప్ప గాలినీ, మేఘాస్త్రంతో పెద్ద మేఘాలనూ సృష్టించినాడు. ఆ తరువాత కర్ణుడు

కూడా అర్జునుడు చూపిన విచిత్రాలన్నీ చూపినాడు. అటుపిమ్మట కర్ణార్జునుల ద్వంద్వయుద్ధం జరిగింది. సభ్యులు వాళ్ళయుద్ధాన్ని బాగా మెచ్చుకున్నారు. అయితే మధ్యలో కృపాచార్యుడు అడ్డువచ్చి రాజకులానికి చెందిన అర్జునునితో యుద్ధం



**అర్జునుని అస్త్రవిద్యా నైపుణ్యత : తక్కిన కురుకుమారులు**

చేయడానికి సూత పుత్రుడైన కర్ణునికి అర్హతలేదని వాదించినాడు. అప్పుడు దుర్యోధనుడులేచి "కర్ణుడు రాజుకాడని మీరంటున్నారు. కనుక ఇప్పుడే నేను అతన్ని అంగరాజ్యానికి రాజుగా చేస్తున్నా"నన్నాడు. అప్పుడే భీష్మ ధృతరాష్ట్రాదుల అనుమతితో అంగరాజ్యం కర్ణునికి ఇచ్చినాడు.

## గురుదక్షిణ

మరునాడు ద్రోణుడు శిష్యుల నందరినీ పిలిచి ఇలా అన్నాడు : "నాయన లారా ! నిన్నటి సభలో మీరు అస్త్రవిద్యలో బాగా ఉత్తీర్ణులైనారని తేలింది. ఇక నేను మీకు నేర్పవలసింది ఏమీలేదు. ఇక నాకు గురుదక్షిణయిచ్చి నన్ను తృప్తి పరచండి". గురువు మాటలు విని కౌరవ పాండవులంతా ఒక్కుమ్మడిగా గురువుకు నమస్కరించి "మీకు ఏం కావాలోచెప్పండి. ఇప్పుడే తెచ్చిఇస్తాము" అన్నారు.

ద్రోణుడు తన కోర్కెను ఇలాచెప్పినాడు : "శిష్యులారా ! నా చిన్ననాటి స్నేహితుడు ద్రుపదుడనే రాజున్నాడు. నేనూ అతడూ ఒకేగురువువద్ద విద్యలు నేర్చుకున్నాము. మా విద్యార్థిదశలో ఒకమాటు ద్రుపదుడు తాను రాజైనతరువాత నేను ఏదడిగితే అది ఇస్తానని వాగ్దానం చేసినాడు. మా విద్యాభ్యాసం అయిపోగానే మేము ఎవరిదారిని వారు వెళ్లిపోయినాము. అతడు పాంచాలదేశానికి రాజైనాడు. నేను బీదబ్రాహ్మణునిగా నానా అగచాట్లు పడ్డాను. కృపాచార్యుని చెల్లెలు నాభార్య, నా కుమారుడు అశ్వత్థామ. బాల్యస్నేహితుడైన ద్రుపదుడు చేసిన వాగ్దానం జ్ఞాపకంవచ్చి అతనివద్దకు వెళ్ళినాను. అతడేమైనా ధనసహాయం చేయక పోతాడా అనుకున్నాను. వెళ్లి నే నతని మిత్రుడనని చెప్పినాను. ద్రుపదుడు ధన బల గర్వంతో కండ్లెట్రజేసి "నాకు నీవు మిత్రుడ వెట్లా అవుతావు ? పేదవాడు ధనికునికి, మూర్ఖుడు విద్వాంసునకు, క్రూరుడు ప్రశాంతునికి మిత్రుడెట్లా అవుతాడు. నిన్ను నేనెరుగను. పోపొ"మ్మని నన్ను అవమానించినాడు. మిత్రుణ్ణి మరచిపోయిన ఆద్రుపదుని దుశ్చర్య నాకు చాలా బాధ కలిగించింది. అవివేకియై ఐశ్వర్యంవల్ల కన్ను మిన్ను గానకుండా నన్ను అవమానించిన ద్రుపదుణ్ణి ఒడిచి పట్టి తీసుకురండి. ఇదే నాకు గురు దక్షిణ".

## అవనీపతికి అవమానం

ఆచార్యులవారికోర్కె తెలియగానే కౌరవులూ పాండవులూ రథాలమీద, గుఱ్ఱాలమీద వివిధ ఆయుధాలతో వెళ్ళి పాంచాల పురాన్ని ముట్టడించినారు.

కౌరవులకూ ద్రుపదునికీ మొదట యుద్ధం జరిగింది. ద్రుపదుని దాడికి ఆగలేక కౌరవులు పారిపోయి పాండవులను ఆశ్రయించినారు. అప్పుడు అర్జునుడు ద్రుపదునిమీద దండెత్తి వెళ్ళినాడు. ఇద్దరికీ ద్వంద్వయుద్ధం జరిగింది. ద్రుపదుడు అర్జునుని ధనస్సును ఒక బాణంతో విరుగగొట్టినాడు. అందుకు అర్జునునికి చాలా కోపంవచ్చి ఖడ్గం చేతపట్టుకొని ద్రుపదుని మీదికి దూకినాడు. ద్రుపదుణ్ణి పట్టుకుని



ద్రుపదుని బంధించి గురుదక్షిణగా గొనివచ్చిన అర్జునుడు

రథానికి కట్టివేసినాడు. అటు భీముడు ద్రుపదుని ఏనుగులను చావగొట్టినాడు. నకుల సహదేవులు సైన్యాన్ని నుగ్గునుగ్గు చేసినారు.

అర్జునుడు ద్రుపదుణ్ణి రథానికి కట్టి తీసుకొనివచ్చి ద్రోణుని పాదాలమీద

పడవేసినాడు. ద్రుపదుడు సిగ్గుతో ద్రోణుని ఎదుట తలవాల్చుకొని నిలుచున్నాడు. "ఏమండీ ద్రుపదమహారాజుగారూ! నేను ఎవరినో ఇప్పటికైనా జ్ఞాపకంవచ్చిందా? మీ ధనమదం తగ్గిందా?" అని ద్రోణుడు ద్రుపదుణ్ణి పరిహాసం చేసినాడు. తన కోర్కె ఈడేరింది గనుక ఇక ద్రుపదుణ్ణి మరీ బాధించడం బాగుండదని ద్రోణుడు అతని కట్లువిప్పి విడిచిపెట్టినాడు. తన ప్రియశిష్యుడగు అర్జునుని పరాక్రమాన్ని చూచి చాలా ఆనందించినాడు.

## దుర్యోధనునికి కన్నెఱ్ఱ

కౌరవ పాండవులలో బలపరాక్రమాలలోనూ, వయసులోనూ, గుణగణాల లోనూ పెద్దవాడైన ధర్మరాజును ధృతరాష్ట్రుడు భీష్మ విదురులతో సంప్రదించి యువరాజుగా నియమించినాడు. ధర్మరాజు చాలా సమర్థతతో పరిపాలన సాగించినవాడు. ఇది దుర్యోధనునికి కన్నెఱ్ఱ కలిగించింది. ఎట్లాగైనా పాండవులను పదవీచ్యుతులను చేసి, బాధించాలనుకున్నాడు. అందుకుతోడు అతని మేనమామ శకునికూడా ఈ చెడుపనికి పూనుకున్నాడు.

## ధృతరాష్ట్రునితో దురాలోచన

దుర్యోధనుడూ శకునీ ఒకనాడు ధృతరాష్ట్రునివద్దకు పోయినారు. దుర్యో ధనుడు తన తండ్రితో ఇట్లా మొరపెట్టుకున్నాడు: "నాయనా! పాండుసుతులు మాకన్న మహావీరులని ఇదివరకే భయపడుతున్నాను. దానికితోడు నీవు ధర్మ రాజును యువరాజుగా నియమించినావు. దానివలన పురజనులు, పల్లెప్రజలు, బ్రాహ్మణులు మున్నగువారంతా ధర్మరాజును గౌరవిస్తున్నారు. నిన్ను, భీష్ముని ఆదరించడంలేదు. నీవు గ్రుడ్డివాడవు. భీష్ముడు బ్రహ్మచారి కనుక రాజ్యం చేయ లేరు. ఇక ధర్మరాజే తమకు రక్షకుడని భావిస్తున్నారు. అతనికే ముమ్ముందు రాజ్యాభిషేకం చేయాలనుకుంటున్నారు. అతడూ మావలెనే యువకుడే అయినా

గుణవృద్ధుడనీ, ధర్మశీలుడనీ పరాక్రమవంతులైన తమ్ములు గలవాడనీ ప్రజలు అతన్ని యెక్కువగా గౌరవిస్తున్నారు. ఇది మాకు గిట్టదు. కనుక నీవు పాండవులను ఈ పురంనుండి వెళ్ళగొట్టే ప్రయత్నం చేయి.''

కొడుకుమాటలు ధృతరాష్ట్రునికి నచ్చలేదు. ఆతడు దుర్యోధనునితో ఇలా అన్నాడు: "కుమారా! నేను అంధుడ నగుటవలన రాజ్యమును నిర్వహింపలేక



ధృతరాష్ట్రునకు దుర్బోధచేయుచున్న దుర్యోధన శకునులు

పోవుటచే నాతమ్ముడగు పాండురాజు నా పక్షమున ఎంతో శ్రద్ధతో రాజ్యపాలనము చేసినాడు. నాకు ఎట్టి కష్టం కలుగకుండా నన్ను ఆదరించినాడు. వికలాంగుడనైన నన్ను నిర్లక్ష్యంచేయక రాజుగా స్వీకరించినాడు. ఎంతో భక్తితో మెలగినాడు. అట్టి

సద్గుణాలుగల పాండురాజుకంటెగూడా అతనికుమారులు మిక్కిలి గుణవంతులు. ప్రజలందరి మన్ననలను పొందినవారు. అట్టివారిని నేను ఎట్లా వెళ్ళగొట్టను?" అది విని దుర్యోధనుడు. "తండ్రీ! నీవు గ్రుడ్డివాడవు గనుక నీ తమ్ముడు రాజై నాడు. ఆ పిమ్మట అతని కొడుకు రాజైనాడు. రేపు ధర్మజుని కుమారులు రాజు లౌతారు. ఈ విధంగా పాండవులు రాజ్యంచేస్తుంటే నీకొడుకులమైన మేము ఎప్పుడూ వాళ్ళకు దాసులముగా బతకాలి. మా కొడుకులూ అంతే. ఈ విధంగా నీ సంతతి సాంతం పాండవులకు దాసులైపోతారు. కనుక ఈ ప్రమాదంనుండి మన సంతతిని కాపాడటానికి ఒక్కటే మార్గం. అది కుంతినీ, పాండవులనూ వారణావతానికి వెళ్ళగొట్టడం. ఈ పని నీవేచేయాలి" అన్నాడు.

## నగరి వెడలిన పాండుసూనులు

ఇష్టం లేకపోయినా ధృతరాష్ట్రుడు కొడుకు మాటలకు లొంగిపోక తప్ప లేదు. తుదకు ఒకనాడు పాండవులను తన వద్దకు పిలిచి ధృతరాష్ట్రుడు కన్నీరు కారుస్తూ ఇలా అన్నాడు: "నాయనలారా! మిమ్మల్ని చూడగానే మీతండ్రి జ్ఞాపకం వస్తున్నాడు. ఆయన ఆత్మశాంతికోసం మీరు గోదానాలు, హిరణ్యదానాలు మొదలగు మహాదానాలు చేయవలెను. అవి ఇక్కడికన్న వారణావతంలో చేయడం మేలు. వారణావత నగరం గంగానదీతీరాన ఉన్నది. అక్కడమీకు లభించని సుఖంలేదు. మీరూ, మీతల్లీ, మంత్రులూ, భృత్యులూ అంతాకలసి వెళ్ళి అక్కడ కొంతకాలం గడిపిరండి." పెదతండ్రి ఆజ్ఞను శిరసావహించి పాండవులు తల్లిని వెంట తీసు కొని భీష్మ, ద్రోణ, కృపాదులకు మ్రొక్కి వారణావతానికి బయలుదేరినారు.

## లక్క యింటిలో నివాసం

దుర్యోధనుడు పురోచనుడనే శిల్పిని పాండవులకంటేముందే వారణావతానికి పంపించినాడు. వాడు అక్కడ లక్కతో ఒక పెద్దమేడను నిర్మించినాడు. ఆమేడను

చాలా అందంగా సిద్ధంచేసినాడు. పాండవులు వారణావతానికి ఫాల్గుణ శుద్ధ అష్టమినాడు వచ్చినారు. పురోచనుడు వారిని తాను నిర్మించిన మేడలో ఉండవల సిందిగా కోరినాడు. పాండవులు ఆ చతుశ్శాల మేడను చూచి పొంగిపోయి అందు నివాసం చేసినారు. కాని కొలదినాళ్ళలోనే ధర్మరాజుకు ఆ ఇంటినిగూర్చి అను మానం వేసింది. సులభంగా నిప్పు అంటుకోడానికి తోడ్పడే లక్కవంటి పదా ర్థంతో తయారుచేసిన మేడలావుందని ఆయన గ్రహించినాడు. భీమునికి తన అనుమానం చెప్పినాడు. ఇదంతా దుర్యోధనుని కుట్రగా గ్రహించినారు. అయితే తెలియనట్లు నటించుతూ పగటిపూట వేటకై అడవికి వెళ్ళుతూ రాత్రిపూట నిద్రపోకుండా ఆయుధాలు ధరించి తిరుగుతూ జాగ్రత్తగా కాలం వెళ్ళబుచ్చినారు.

## గండం గడచింది

హస్తినాపురంలో విదురునికి దుర్యోధనుని ఈ కుట్ర తెలిసింది. వెంటనే ఒక మనిషిని రహస్యంగా పాండవులవద్దకు పంపినాడు. వాడువచ్చి బహుళ చతు ర్దశినాటిరాత్రి లక్కయింటిని దహనంచేసి అందు పాండవులను భస్మం చేయవల సిందిగా దుర్యోధనుడు పురోచనునికి పంపిన ఆజ్ఞను గూర్చి పాండవులకు చెప్పి నాడు. అంతేగాక ఆతడు లక్కయింటిలోనుంచి అరణ్యంలోకి ఒక పెద్ద బిలం త్రవ్వినాడు. ప్రమాదసమయంలో ఆ మార్గాన తప్పించుకొమ్మని చెప్పినాడు.

లక్కయిల్లు తగులబడవలసిన రోజువచ్చింది. ఆ రోజు కుంతి బ్రాహ్మణ స్త్రీలను భోజనాలుపెట్టి వాళ్ళను పూజించింది. ఆ రాత్రి అంతా నిద్రపోయినాక భీముడు లేచినాడు. ఇల్లు తగులపెట్టవలసిన పురోచనుడు ఇంకా ఆ పనికి పూను కోకముందే వాడు పడుకొనివున్న గదితలుపులు మూసి నిప్పు అంటించినాడు. వెం టనే తన తల్లిని అన్నదమ్ములను బిలంలోకి పంపించినాడు. లక్కయింటికంతటికీ

నిప్పు అంటించినాడు. తాను తప్పించుకొని బిలంద్వారా తల్లితో అన్నదమ్ములతో అడవిలోకి వెళ్లిపోయినాడు. ఆ రాత్రి ఒక యెరుకుది తన అయిదుగురు పిల్లలతో ఆ యింట్లో పండుకొనివుండెను. వాళ్లంతా పురోచనుడితో గూడా ఆయింట్లో కాలిపోయినారు.



లక్కయిల్లు కాలుచుండ గుహమార్గమున తప్పించుకువచ్చిన పాండవులు

## దుర్వార్త విన్న ధృతరాష్ట్రుడు

తెల్లవారేసరికి పూర్తిగా కాలి బూదికుప్పగా మారిపోయిన ఆ భవనాన్ని చూడడానికి జనం అంతావచ్చినారు. బూడిదంతా పెళ్ళగించి చూడగా ఒక స్త్రీ అయిదుగురు యువకులూ చచ్చి మాడిపోయి ఉన్నారు. వారే కుంతీదేవి, పాండ

వులూ అనుకుని జనంఅంతా దుఃఖపడ్డారు. దుర్యోధనుని అనుచరులు అదిచూచి చాలా సంతోషించినారు. ఈ విషయం హస్తినాపురంలోని ధృతరాష్ట్రునికి తెలియ జేసినారు. ధృతరాష్ట్రుడు, పాండవులు లక్కయింటిలో చనిపోయినందుకు చాలా



లక్కయింటిలో పాండవులు మరణించినట్లు విని దుఃఖించుచున్న ధృతరాష్ట్రుడు.

చింతించినాడు. భీష్మాదులు కూడా చాలా దుఃఖించినారు. విదురుడు పాండవుల క్షేమవార్త తెలిసియుండికూడా తెలియనట్లు వాండ్లతోపాటే కంటతడి పెట్టినాడు.

# కీకారణ్యంలో పాండవులు

పాండవులు కుంతితోగూడా గంగనుదాటి దక్షిణంవైపు ప్రయాణంచేసి ఒక దట్టమైన అడవిని చేరుకున్నారు. ప్రయాణపు బడలికవల్ల కుంతి, ధర్మరాజు, అర్జునుడు, నకుల సహదేవులు ఒక మఱ్ఱిచెట్టుక్రింద పడుకున్నారు. భీముడు వారిని కాపలా కాస్తున్నాడు. వాళ్ళను హిడింబుడనే రాక్షసుడు చూచినాడు. ఎప్పుడూ జంతుమాంసం తినడంవల్ల నాల్కరుచి చచ్చివున్న హిడింబుడికి ఈ మానవులను చంపి తినాలనిపించింది. తన చెల్లెలు హిడింబను పిలిచి ఇలా అన్నాడు: "చెల్లీ! ఇంత కీకారణ్యంలోకి మనుష్యులు వస్తారా? వచ్చినా నిర్భయంగా ఇలా నిద్రపోతారా? వంట ఇంట్లోకి కుందేలు చొరబడ్డట్టు వీళ్లు మన అడవిలోకి వచ్చినారు. నీవు పోయి వాళ్ళను చంపి తెచ్చి నాకు వండిపెట్టు".

# రమణియైన రాక్షసి

అన్న చెప్పినప్రకారం హిడింబ పాండవులవద్దకు వచ్చింది. తామరలవలె అందమైన నేత్రాలతోను, విశాలమైన రొమ్ముతోను, బలంగా అందంగావున్న భీముణ్ణి చూచింది. మనస్సు చలించింది. అతన్ని పెళ్ళి చేసుకోవాలనిపించింది. తన అన్నచెప్పిన పని మరచిపోయింది. అందమైన మనుష్య స్త్రీరూపం ధరించి ఆభరణాలతో మంచి దుస్తులతో భీముని దగ్గరగా వచ్చింది. భీముడు "నీ వెవ్వరు? ఈ అడవిలో ఒంటరిగా తిరుగుతున్నావు" అని ఆమెను అడిగినాడు, నేను హిడింబాసురుడనే గొప్ప రాక్షసుని చెల్లెలిని. మిమ్మల్ని చంపి తీసుకురమ్మని మా అన్న ఆదేశించినాడు. కాని నీ అందం చూచి నాకు నిన్ను పెళ్ళి చేసుకోవాలనిపించింది. నన్ను పెళ్ళిచేసుకుంటే నేను మిమల్ని ప్రమాదంనుండి కాపాడుతాను. లేకుంటే మా అన్న మిమ్మల్ని చంపితింటాడు," అన్నది. "తల్లిని, సోదరులను విడిచి నీతో తిరగడం నావల్లగాదు" అన్నాడు భీముడు. "అయితే వాళ్ళనుకూడా తీసుకుని

ఎటైనాపోదాం'' అన్నది హిడింబ. "నిద్రపోతున్నవాళ్ళను నేను లేపను'' అన్నాడు భీముడు. "ఆలస్యంచేస్తే మా అన్నపచ్చి మిమ్మల్ని చంపుతాడు'' అన్నది హిడింబ. "ఏదీ, రానీ చూతాం'' అన్నాడు భీముడు. అంతలో అరుచుకుంటూ గద బుజాన పెట్టుకుని హిడింబాసురుడు రానేవచ్చినాడు. ఆలస్యం చేసినందుకు చెల్లెల్ని చంప బోయినాడు. అది భీమునివెనక దాక్కున్నది. భీముడు అమాంతం హిడింబాసు



హిడింబాసురుని సంహరించుచున్న భీముడు

రుని పట్టుకొని కొంతదూరం లాక్కుపోయినాడు. అక్కడే యుద్ధంచేస్తే ఆ చప్పుడుకు తల్లీ సోదరులూ నిద్రచెడి, లేస్తారనిభయపడి హిడింబుణ్ణి దూరంగా తీసుకుపోయి మోకాలితో డొక్కలో పొడిచినాడు. ఆ పోటుకు హిడింబుడు సహించలేక

పెద్ద కేక పెట్టినాడు. మళ్ళీ మెల్లగా సర్దుకొని భీమునిమీద పడినాడు. భీముడు వాని ఎడమకాలు పట్టుకొని నూరుసార్లు గిరగిరాతిప్పి నడుం విరిగేట్టు నేలకు కొట్టినాడు. ఆ దెబ్బకు హిడింబాసురుడు నెత్తురు కక్కుకుని ప్రాణాలు విడిచినాడు. ఈద్వంద్వ యుద్ధం చప్పుడుకు కుంతి కొడుకులతోకూడ మేలుకొని హిడింబ దారిచూపగా యుద్ధం జరిగేచోటికి వచ్చింది. వచ్చి వచ్చి హిడింబాసురుడు చావడం చూచింది. భీముని బలాన్ని అంతా మెచ్చుకున్నారు.

## ఘటోత్కచుని పుట్టుక

హిడింబకు భీమునిపై అనురాగమేర్పడాన్ని వారంతా గమనించి వారిరువురికీ



యవ్వనముతో పుట్టిన ఘటోత్కచుని ఆశీర్వదించు పాండవులు

వివాహం జరిపించినారు. భీముడు హిడింబతో ఆ అడవిలో కొంతకాలం సుఖంగా గడపినాడు. ఆ తరువాత వారిరువురికీ ఘటోత్కచుడనే కుమారుడు ఉద్భవించి నాడు. అతడు పుట్టగానే నవయౌవనుడుగాను, అనేక శాస్త్రాలు తెలిసినవాడుగాను కనిపించినాడు. తల్లిదండ్రులకూ, కుంతికీ నమస్కరించి ఇలా అన్నాడు. "నేను రాక్షససైన్యంతో అరణ్యాల్లోనే ఉంటాను. మీరు ఎప్పుడు కోరితే అప్పుడువచ్చి మీకు తోడ్పడతాను."

## ఏకచక్రపురంలో పాండవులు

పాండవులు ఘటోత్కచుని వీడ్కొలిపి తాము ఏకచక్రపురానికి వచ్చినారు. ఆ ఊరిలో ఒక్క పేదబ్రాహ్మణుని ఇంట విడిదిచేసినారు. వేషాలు మార్చుకొని నారచీరలు కట్టుకుని, ఋషులవలె జడలు పెంచుకుని వేదమంత్రాలు చదువుతూ కొన్నినాళ్లు గడపినారు.

ఒకనాడు వారు విడిదిచేసినఇంటివాళ్ళు గోడుగోడున ఏడ్పు మొదలు పెట్టి నారు. అది విని భీముడు, కుంతి కారణం అడుగగా ఇంటి యజమాని ఇలా చెప్పినాడు: "ఇక్కడికి దగ్గరగా అరణ్యంలో బకాసురుడనే రాక్షసుడొకడు ఉంటున్నాడు. వాడు ఊళ్ళో చొరబడి కనబడ్డ వాళ్ళనల్లా చంపి తింటుండేవాడు. అది చూచి భరించలేక అతనితో ఒక ఒప్పందానికి వచ్చినాము. అదేమనగా ఈ ఊళ్లో కుటుంబానికి ఒక్కరి లెక్కన ప్రతిరోజూ బకాసురునికి ఆహారంగా ఇస్తా మన్నాము. అందుకు వాడు సమ్మతించినాడు. ఆనాటినుంచి రోజూ ఒకణ్ణి పంపు తున్నాం. నేడు మావంతు వచ్చింది. మా కుటుంబంలో నేనూ, నా భార్య, ఒక కుమారుడూ, వున్నాం. మాలో ఇవాళ ఎవ్వరము వెళ్ళవలెనో తోచక ఇలా ఏడు స్తున్నాము."

ఈ మాటలు వినగానే భీమునికి దుఃఖం పొంగివచ్చింది. బకాసురుడిమీద కోపం హెచ్చింది. తమకు ఆశ్రయం ఇచ్చిన కుటుంబానికి కలిగిన కష్టాన్ని తీర్చాలనే పట్టుదల కలిగింది. కుంతికిగూడ బ్రాహ్మణులకు గలిగిన ఇబ్బందికి

దుఃఖం వచ్చింది. కుంతి ఆ బ్రాహ్మణునితో ఇలా అన్నది: "నీకు ఒక్కడే కొడుకు. వానిని బలిఇస్తే నీ వంశమే ఇంతటితో ముగిసిపోతుంది. నాకు అయిదు గురు కొడుకులున్నారు. వీరిలో ఒకనిని నీ కొడుకుకు బదులుగా బకాసురునికి ఆహారంగా పంపుతాను. నీవుభయపడకు."

బ్రాహ్మణుడు కన్నీరుకారుస్తూ "తల్లీ! అతిథిగా వచ్చిన నీకుమారుని బలి ఇవ్వనిస్తానా? నేను అంతదుర్మతినా? వద్దు వద్దు నీకొడుకును పంపవద్దు" అన్నాడు. అప్పుడు కుంతి "నాయనా! నాకొడుకును చంపగలశక్తి ఏ రాక్షసునికీలేదు. నా రెండవ పిల్లవాడను భీముడు ఇప్పటికి ఎందరినో రాక్షసులను చంపినాడు. కనుక మాకేమి భయంలేదు మీకు ఈనాటితో బకాసురుని పీడపోతుంది" అన్నది.

## భీముని సాహసం

భీముడు ఒక బండినిండా భక్ష్యాలూ అన్నమూ పెట్టుకుని బకుడున్న ప్రాంతానికి వెళ్లినాడు. ఆ ప్రాంతం అంతా శవాల దుర్వాసనతో నిండివుంది. కనుక అక్కడికి దగ్గరగా యమునానది ఒడ్డున బండినిలిపి బకాసురున్ని పెద్దగా పిలువడం మొదలు పెట్టినాడు. బకుడు తొందరగా రాలేదు. వాడు వచ్చేదాకా ఊరికే కూర్చోవడం ఎందుకని యమునలో కాళ్లుచేతులు కడుక్కొని బకుడి కోసం తెచ్చిన భక్ష్యాలు, అన్నం తినడం ప్రారంభించినాడు. ఇంతలో బకుడు ఆవులించుకుంటూ "ఇవాళ ఆహారం ఆలస్యంగా తీసుకుని వచ్చినావేం" అని గద్ది రిస్తూ భీముని వద్దకు కోపంతో వచ్చినాడు. అప్పటికే భీముడు బండిలోని తిను బండారం సాంతంతిని యమునలో చల్లనీళ్లుత్రాగి బేవుమని త్రేనుస్తూకూచున్నాడు.

## బకాసురవధ

"ఏమిరా! నాకోసం తెచ్చిన అన్నమంతా నీవేతిన్నావే, ఇక నిమిషంలో చావ వలసిన నీకు ఎంతసాహసం" అంటూ గర్జించినాడు బకుడు. "ఇక నిమిషంలో

చచ్చేది నీవా నేనా?" అన్నాడు భీముడు. ఆ మాటవిని బకునికి మరీకోపం వచ్చింది. దగ్గర వున్న ఒకచెట్టును వ్రేళ్ళతో పెరికి భీమునిమీదికి విసరినాడు. భీముడు మరోచెట్టు పెరికి అడ్డు తాకినాడు. కొంతసేపు చెట్లతో పోట్లాడి ఆ తరువాత వారు మల్లయుద్ధం చేసినారు. అప్పుడు భీముడు బకుని నడుమును మెడను రెండు చేతు




బకాసురుని వధించుచున్న భీముడు.

లతో పట్టుకొని మోకాలితో వీపులో పొడిచినాడు. ఆ పోటుకు బకుని వెన్నెముక విరిగింది. నవరంధ్రాలలో నుంచి నెత్తురు బయటికి చిమ్మింది. "హా హా" అని అరుస్తూ బకాసురుడు ప్రాణాలు వదలినాడు.

ఏకచక్రపురంలోని జనులు అంతా ఆ చోటికి వచ్చి బకుని చావును చూచి చాల ఆనందించినారు. మహాబలవంతుడైన భీముడు తమకు చేసిన ఉపకారానికి అతన్ని వేనోళ్ల పొగడినారు. రాక్షస బాధనుండి తప్పిన ఏకచక్రపురం ఆనాడు పెద్ద ఉత్సవం చేసుకున్నది. జనులు భీమునికి జేజేలు కొట్టినారు. పాండవులు ప్రజల మన్ననలను పొందుతూ సుఖంగా కొన్నాళ్లు ఏకచక్రపురంలోనే వున్నారు.

## శుభ వార్త

ఒకనాడు పాండవులు బసచేసిన బ్రాహ్మణుని ఇంటికి ద్రుపదపురంనుండి ఒక అతిథి వచ్చినాడు. కుంతి అతనికి కడుపునిండా భోజనంపెట్టి సంతృప్తుణ్ణి చేసింది. ఆ తరువాత పాండవులూ కుంతీ అతనిని యాత్రావిశేషాలు అడిగినారు. అతడు ఇలాఅన్నాడు:"నేను చాలాదేశాలు చూచినాను. చాలామంది రాజులను సందర్శించినాను. కాని ద్రుపదుని దేశంవంటి మంచిదేశంగాని, ద్రుపదరాజువంటి ప్రభువుగాని మరెక్కడా కనపడలేదు. ఆయనకు ఒక చక్కని కూతురు ఉన్నది. ఆమెకు తగిన వరుడు ఎక్కడా లభింపక తుదకు స్వయంవరం ఏర్పాటు చేయాలని నిశ్చయించినాడు. అసలు ఆ అమ్మాయిని అర్జునునికి ఇవ్వాలని అతని అభిమతం. అయితే వారు వారణావతంలో లక్కయింటిలో కాలి చనిపోయినారు. అందుకు ద్రుపదుడు చాలా దుఃఖించినాడు. తుదకు ఈ స్వయంవరం ఏర్పాటు చేస్తున్నాడు. ఎవడైనా అర్జునునివంటి వీరుడు వస్తే స్వయంవరంలో అట్టివానినే ఆ అమ్మాయి వరిస్తుంది".

"ఆ అమ్మాయి పేరేమిటి నాయనా !" అని అడిగింది కుంతి.

"ఆ అమ్మాయి పేరు కృష్ణ. ఆ పేరు ఆమెకు ఆకాశవాణి పెట్టింది" అన్నాడు యాత్రికుడు.

"అయితే స్వయంవరం ఎప్పుడు?" అని అడిగినాడు అర్జునుడు. "స్వయం వరం మరోనెలరోజుల్లో జరుగుతుంది" అని చెప్పినాడు యాత్రికుడు. కుంతికీ పాండవులకూ ద్రుపదరాజు కూతురు స్వయంవరం చూడాలనిపించింది. అప్పటికే ఏకచక్రపురంవచ్చి చాలాకాలం గడచిందిగనుక చోటుమార్చాలనే తలంపు పాండవులకు కలిగింది. అంతా కలిసి మెల్లగా ఒక్కొక్క వూరుచూస్తూ బ్రాహ్మణ వేషాలతో స్వయంవరం సమయానికి ద్రుపదపురం చేరుకున్నారు.

## ద్రుపదపురంలో పాండవులు

వారు ఆవూరు చేరుకునేప్పటికే దేశదేశాలనుండి రాజులూ, రాకుమారులూ వచ్చినారు. ఊరంతా మహాసముద్రంవలె పొంగులెత్తుతున్నది. అంతా కోలాహలంగావుంది. ఎటువిన్నా మంగళవాద్యాలు, ఎటుచూచినా పెండ్లి అలంకరణాలు, ఎటుపోయినా పెండ్లి సన్నాహాలు.

## స్వయంవర మంటపం

ఊరికి పూర్వోత్తర దిక్కున చాలా అందంగా నిర్మించిన స్వయంవర మంటపానికి అంతా చేరుకున్నారు. పాండవులు బ్రాహ్మణులలో కూర్చున్నారు. రాజు లంతా మరోవైపు కూర్చున్నారు.

దూరాన ఎత్తైనచోట మత్స్యయంత్రము అమర్చబడియున్నది. ఆ యంత్రముక్రిందుగా నీటితొట్టి ఉన్నది. ప్రక్కగా ఒక విల్లు, అయిదుబాణాలు ఉన్నవి. వాటిని బ్రాహ్మణోత్తములు ధూపదీపాలతో అర్చిస్తున్నారు.

## ధృష్టద్యుమ్ముని ప్రకటన

సభకు రాజులూ, బ్రాహ్మణులూ అంతావచ్చి తమతమ స్థలాలలో కూర్చున్నారు. అప్పుడు ద్రుపదుని కుమారుడు ధృష్టద్యుమ్నుడు వేదికమీదికివచ్చి ఇలా

ప్రకటించినాడు: "సభాసదులారా! నా చెల్లెలు స్వయంవర మహోత్సవానికి మీరంతా రావడం సంతోషం. అదిగో మత్స్యయంత్రం. ఆ ప్రక్కగా ఉన్న ధనుస్సూ అయిదుబాణాలూ చూడండి. మత్స్యయంత్రం నీటిలో ప్రతిబింబించేటట్టు ఏర్పాటు చేసినాము. నీళ్ళల్లో మత్స్య ప్రతిబింబంచూచి ఈ అయిదు బాణాలతో యంత్రాన్ని కొట్టాలి. అలా కొట్టగలిగినవాణ్ణి నా చెల్లెలు కృష్ణ వివాహం చేసుకుంటుంది. మీరు మీమీ ధనుఃకౌశల్యం చూపండి".

## మత్స్యయంత్రాన్ని కొట్టలేని మహీపతులు

సభలో దుర్యోధనాదులు సూతుగురు, కర్ణుడు, అశ్వత్థామ, సోమదత్తుడు మున్నగువారు, శల్య జరాసంధ శిశుపాల సేనాయులు, దృష్టి, కృతవర్మ, సాత్యకి, సాంబాది యాదవవీరులు కూర్చుని ఉన్నారు. వాళ్ళల్లోనుంచి ఒక్కొకడూ లేచి విల్లును చేపట్టడానికి ప్రయత్నించినారు. కొందరు విల్లును కదల్చలేక సిగ్గుతో వెనక్కు తిరిగి వచ్చినారు. కొందరు దానిని ఎక్కుపెట్టలేక పోయినారు. కొందరు అయిదు బాణాలు వేసికూడా మత్స్యయంత్రాన్ని కొట్టలేక పోయినారు. కొందరు తమ పీఠాలమీదినుండి కదలనేలేదు. మొత్తంమీద రాజుల, రాజకుమారుల దిక్కునుండి అంతా మత్స్యయంత్రం కొట్టలేక పోయినారనే చెప్పవలెను.

## అర్జునుని అలౌకికశక్తి

అప్పుడు బ్రాహ్మణులలోనుండి అర్జునుడు లేచివెళ్ళినాడు. అటు రాజులూ ఇటు బ్రాహ్మణులూ ఆశ్చర్యపడినారు. బ్రాహ్మణుడేమిటి, మత్స్యయంత్రం కొట్టడానికి ప్రయత్నించడం ఏమిటి అని అంతా నవ్వుతున్నారు. అర్జునుడు నిర్భయంగా వెళ్ళి అవలీలగా ధనుస్సును ఎక్కుపెట్టి, అయిదు బాణాలతో మత్స్యయంత్రాన్ని కూలగొట్టినాడు. అంతా ఆశ్చర్యంతో, ఆనందంతో చప్పట్లు చరిచినారు. ద్రుపదుని

కూతురు కృష్ణ ఒయ్యారంగా నడచివచ్చి తెల్లని పూలమాలను ఇంద్రుడిలా ఉన్న అర్జునుని మెడలోవేసి సిగ్గుతో తలవంచుకొని నిలుచుంది. "బాపనికి పిల్లనిచ్చి మమ్మల్ని అవమానం చేస్తావా ?" అని రాజులంతా ద్రుపదుణ్ణి దూషించినారు.



ద్రుపదుని కొలువులో మత్స్యయంత్రము భేదించుచున్న అర్జునుడు

అప్పుడు వ్యాసమహాముని అడ్డువచ్చి "ఇతడు మహాపరాక్రమవంతుడైన అర్జునుడు" అని చెప్పినాడు. పాండవులు బ్రతికే ఉన్నారని ఎరిగి ద్రుపదుడు, ధృష్టద్యుమ్నుడు, కృష్ణ (ద్రౌపది) సంతోషించుచుండగా కౌరవులంతా కోపంతో మండిపోయినారు. ఏమీ చేయజాలక నోరుమూసుకున్నారు.

# అయిదుగురు పంచుకొన్న అమృతభిక్ష

భీముడూ అర్జునుడు ద్రౌపదిని తీసుకుని తల్లివద్దకు వచ్చి నమస్కరించి "అమ్మా! మేము భిక్ష తెచ్చినాము" అన్నారు. అదివిని తల్లి ఎప్పటిమాదిరే "నాయనలారా! మీరైదుగురూ ఉపయోగించుకోండి" అన్నది. ఆ తరువాత తన తప్పును గుర్తించి చాలా విచారించింది. అయితే తాను అన్నమాట కాకతప్పదు గనుక ద్రౌపదిని అయిదుగురికీ భార్యగా నియమించింది. పాండవులుకూడా సంతోషంతో ఆమెను తమ పత్నిగా అంగీకరించినారు. ద్రుపదమహారాజు కూడా సమ్మతించి వైభవంగా పాండవులకు ద్రౌపదితో వివాహం జరిపించినాడు.

# పాండవులకు రాజ్యప్రాప్తి

పాండవులు ఇంకా చావక బ్రతికియుండి, పైగా తమనందరినీ కాదని సుందరాంగియైన ద్రౌపదిని పెండ్లియాడి సుఖంగా ఉండడంచూచి దుర్యోధనుడు మండిపోయినాడు. వాళ్ళను ఎట్లా నాశనం చేయవలెనా అని మళ్ళీ ఆలోచించ సాగినాడు. పాండవులు సురక్షితంగావున్న విషయం తెలిసిన ద్రోణుడు, భీష్ముడు, ధృతరాష్ట్రుడు, విదురుడు మున్నగువారు చాలా సంతోషించినారు.

పరాక్రమవంతులైన పాండవులకు ఎవ్వరును ఎట్టి అపకారం చేయజాలరని ధృతరాష్ట్రుడు, మున్నగువారంతా అనుకున్నారు. వారికి అపకారం చేయాలని మళ్ళీ పన్నాగాలు పన్నజూస్తున్న దుర్యోధనునికి భీష్మాదులు జ్ఞానబోధచేసి అట్టి పనులు మంచివి కావని చెప్పినారు. ధృతరాష్ట్రుడు పాండవులకు అర్ధరాజ్యం ఇవ్వడానికి అంగీకరించినాడు. పాండవులను హస్తినాపురానికి తీసుకునిరమ్మని విదురుణ్ణి పంపినాడు.

విదురుడు ద్రుపదపురానికి వెళ్ళి పాండవులను దర్శించినాడు. ధృతరాష్ట్రుని కోర్కె తెలియజేసి హస్తినాపురానికి రావలసిందిగా కోరినాడు. ద్రుపదుడు, కృష్ణుడు మున్నగువారు కూడా పాండవులకు హస్తినాపురానికి వెళ్ళమని సలహా ఇచ్చినారు.



పాండవులకు ఇంద్రప్రస్థము నొసంగుట

ధర్మరాజు తనతల్లితో, తమ్ములతో విదురునివెంట హస్తినాపురానికి వచ్చినాడు. వారికితోడుగా ధృష్టద్యుమ్నుడు మున్నగువారు పెద్ద సైన్యంతో వచ్చినారు. ధృతరాష్ట్రుడు వికర్ణ చిత్రసేన ద్రోణ కృపాచార్యులను పాండవులకు ఎదురు వెళ్ళమని పంపినాడు. వారు పురద్వారము వద్దకు వెళ్ళి పాండవులను ఆహ్వానించినారు.

పురజనులు మహానందంతో పాండవులను దర్శించినారు. ధర్మమూర్తులైన పాండవులు తమ పట్టణానికి మళ్లీ రావడం తమ పుణ్యంగా భావించినారు. పాండవులు దుర్యోధనాదులు కలిసి ద్వేషాలు మరచి అయిదేండ్లు సుఖంగా ఉన్నారు.

ఆ పిమ్మట ధృతరాష్ట్రుడు తాను అన్నరీతిగా అర్ధరాజ్యం పాండవులకు ఇచ్చినాడు. ఖాండవప్రస్థమనే నగరాన్ని రాజధానిగా చేసుకొని సుఖంగా రాజ్యం చేయవలసిందిగా పాండవులను కోరినాడు. వారు అందుకు అంగీకరించి ఖాండవప్రస్థానికి వెళ్ళినారు. అక్కడ విశ్వకర్మతో ఇంకొక పట్టణం కట్టించినారు. అది సురపురంకంటె, కుబేరునిపట్టణంకంటె అందంగా వుంది దానికి ఇంద్రప్రస్థం అని పేరు పెట్టినారు.

తల్లితో, తమ్ములతో, ద్రౌపదితో ధర్మరాజు ఇంద్రప్రస్థంలో సుఖంగా వున్నాడు. శాంతంగా రాజ్యపాలనం సాగించినాడు.

## నారదుని హితబోధ

ఒకనాడు నారదుడు ఇంద్రప్రస్థానికి వచ్చినాడు. "నాయనలారా! మీరు సుఖంగా రాజ్యం చేయడం నాకు ఎంతో ఆనందాన్ని కలిగించింది. మీరు ఐదుగురూ ద్రౌపదిని భార్యగా చేసుకున్నారు. ఇది లోకంలో ఎక్కడాలేదు. ఐతే ఎట్టి కలహం లేకుండా మీరు సఖ్యంతో వుంటే మంచిదే కాని స్త్రీవల్ల కలహాలు వస్తవి. వెనుక సుందోపసుందులు ఒక స్త్రీకోసం కొట్టుకొని చచ్చినారు. అట్టిప్రమాదం ఏర్పడకుండా ఉండాలంటే మీరు ఒక కట్టుబాటు చేసుకోవాలి" అని హితబోధ చేసినాడు.

పాండవులకు నారదుని మాటలు నచ్చినవి. తమలో తాము ఆలోచించుకుని నిర్ణయానికి వచ్చినారు. ఆ నిర్ణయం యేమనగా ద్రౌపది పాండవులలో ఒక్కొక్కరి ఇంటిలో ఒక్కొక్కయేడుండవలెను. ఆమె ఎవ్వరియింటిలో వుంటుందో ఆ ఇంటికి

మరొకడు రాకూడదు. అట్లా పొరపాటున ఎప్పుడైనా, ఎవరైనా వస్తే పన్నెండు నెలలు తీర్థయాత్రలు చేయవలెను. ఈ నిర్ణయం నారదునికికూడా నచ్చింది. "అట్లే నడుచుకొం"డని వారిని దీవించి నారదుడు తనదారిని తాను వెళ్లిపోయినాడు.



పాండవులకు హితబోధ చేయుచున్న నారదుడు

## ధర్మవీరుడు అర్జునుడు

ఇట్లా సుఖంగా కాలం గడుపుతుండగా ఒకనాడు ఒక బ్రాహ్మణుడు ఆర్తనాదంచేస్తూ అర్జునునివద్దకు వచ్చినాడు. "పార్థా! చోరులు నా హోమధేనువును ఎత్తుకొని పోయినారు. ధర్మాత్ములైన మీ రాజ్యంలో పట్టపగలు గోవుల

దొంగిలింపు జరిగింది. చోరులను గెలిచి నా హోమధేనువును తెచ్చిపెట్టు" అని అర్జునుణ్ణి ఆ బ్రాహ్మణుడు దీనంగా కోరినాడు. చోరులను వెన్నాడుటకు ధనుస్సు కావలసి వచ్చింది. ధనుస్సు ధర్మరాజు ఆయుధశాలలో ఉన్నది. ఆ సంవత్సరం ద్రౌపది ధర్మరాజువద్ద వుంటున్నది. అట్టి స్థితిలో అర్జునుడు ధర్మరాజు ఇంటికి వెళ్ళగూడదు. కాని ఇవన్నీ ఆలోచించే సమయంలేదు. కనుక, వెనక ముందు



గోబ్రాహ్మణులను రక్షించుటకై ఆయుధముల గొనిపోవచ్చిన అర్జునుడు

చూడక ధర్మరాజుగారి ఆయుధాగారంలో ప్రవేశించి తన ధనుస్సుతీసుకుని దొంగలను వెన్నాడినాడు. చోరులను పట్టి బంధించి బ్రాహ్మణుని హోమధేనువును వారి బారినుండి తప్పించినాడు. బ్రాహ్మణునికి ఇప్పించినాడు.

తిరిగి ఇంటికివచ్చి తాను ధర్మరాజు గృహంలోకిపోయి ధనుస్సు తీసుకున్న తప్పిదానికి పన్నెండునెలలు తీర్థయాత్రకు పోవాలని నిశ్చయించుకున్నాడు. అది తెలిసి ధర్మజుడు ఇలా అన్నాడు: "అర్జునా! చోరులను చెండాడడానికి, గో బ్రాహ్మణులను కాపాడడానికీ నీవు ఆయుధాగారంలోకి వచ్చి ధనుస్సు తీసుకున్నావు కనుక తప్పులేదు. పన్నెండు నెలలు తీర్థయాత్ర చేయనక్కరలేదు" అన్నాడు. కాని అర్జునుడు అందుకు సమ్మతించక "మనం ఏర్పరచుకున్న కట్టుబాట్లను మనమే ఉల్లంఘించితే లోకం ఏమంటుంది? అందుకోసం నేను పన్నెండు నెలలు యాత్ర చేయవలసిందే" అన్నాడు. అతన్ని వారించడానికి ఎవరికీ శక్యం కాకపోయింది.

## అర్జునుని తీర్థయాత్ర

అర్జునుడు తల్లిని, అన్నను ఒడంబరచి యాత్రకు బయలుదేరినాడు. అనేక క్షేత్రాలు దర్శించినాడు. కొన్నాళ్ళకు గంగాతీరం చేరుకున్నాడు. అక్కడ పితృతర్పణం చేసినాడు.

## ఉలూచి ప్రేమకలాపం

రూపవంతుడైన అర్జునుణ్ణి గంగానదిలో ఒక నాగకన్యక చూచింది. అతని సౌందర్యానికి ముగ్ధురాలైంది. అర్జునుణ్ణి నాగలోకానికి తీసుకొనిపోయింది. చక్కని ఒక మేడలో ఉంచింది.

"నన్ను ఇట్లా భూలోకంనుంచి పట్టుకొనివచ్చిన నీవు ఎవ్వరవు?" అని అడిగినాడు అర్జునుడు.

"నేను ఉలూచి అను నాగకన్యను. నిన్ను చూడగానే నాలో ప్రేమ ఉద్భవించింది. నన్ను పెళ్లిచేసుకోవాలి" అన్నది నాగకన్యక.

"నేను వ్రతనిష్ఠుడనై ఉన్నాను. ప్రస్తుతం బ్రహ్మచర్యం చేస్తున్నాను. నిన్ను పెండ్లిచేసుకుంటే నాకు వ్రతభంగం కలుగుతుంది. కనుక నిన్ను పెండ్లి ఆడలేను" అన్నాడు అర్జునుడు.



నిదురలోనున్న అర్జునుని వలచిన ఉలూచి

"ఐతే నీకోసం తపించి, తపించి చచ్చిపోతాను. ఆ పాపం నీకు చుట్టు కుంటుంది. కనుక నాకు ప్రాణదానంచేయి. నీ వ్రతానికి ఎట్టి భంగంరాదు" అన్నది ఉలూచి. ఆమాటలు అర్జునుణ్ణి కరగించినవి. అర్జునుడు ఉలూచిని వివాహమాడి నాడు. నాగకన్యకలు అర్జునునికి నీరాజనం ఎత్తినారు. పాడినారు. ఆడినారు. రక

రకాల సువాసినలు చిమ్మే పూలమాలలు వేసినారు. చందనం పూసినారు. ఉలూచినీ అర్జునున్నీ ఊరేగించినారు. అర్జునునివలన ఉలూచి ఇరావంతుడను వానిని పడసినది.

## చిత్రాంగదా వివాహం

అక్కడినుండి బయలుదేరి అర్జునుడు మణిపురమునకు వచ్చినాడు. అక్కడి రాజైన చిత్రవాహనుడు అర్జునుణ్ణి ఆహ్వానించి అనేకపూజలుచేసి సత్కరించినాడు. "నీవంటి మహావీరుడు మా పట్టణానికి రావడం మా పుణ్యఫలితం. నీవు వచ్చినప్పుడు నిన్ను మేము తోచినరీతిని గౌరవించాలి. నేను నాకూతురు చిత్రాంగద నిచ్చి నీకు పెండ్లి చేస్తాను" అన్నాడు చిత్రవాహనుడు. అర్జునుడు అందుకు అంగీకరించి చిత్రాంగదను వివాహమాడినాడు. చిత్రాంగదకు అర్జునునికీ బభ్రువాహనుడు ఉద్భవించినాడు.

## యతివేషంలో అర్జునుడు

అర్జునుడు మణిపురంనుండి యతివేషంలో ద్వారకా నగరానికి వచ్చినాడు. శ్రీకృష్ణుణ్ణి దర్శించి నమస్కరించినాడు. ఇరువురు ఎంతోస్నేహంగా ఒకరినొకరు కౌగిలించుకున్నారు. శ్రీ కృష్ణుడు అర్జునునికి రైవతక పర్వత గుహలో విడిది ఏర్పాటు చేసినాడు. రైవతక మహోత్సవం చేయువలసిందిగా యాదవులకు చెప్పినాడు.

అందమైన గొల్లపడుచులంతా రైవతక పర్వతం వెళ్ళి యతి వేషంలో వున్న అర్జునుణ్ణి పూజించినారు. కృష్ణుని చెల్లెలు సుభద్ర కూడా వెళ్ళి ఆయన్ను పూజించింది. అర్జునుడని తెలుసుకొని చాలా సంతోషించింది. అర్జునునికి గూడా ఆమె సుభద్ర అని తెలిసింది. ఇద్దరూ ఒకరినొకరు ప్రేమతో చూచుకున్నారు. ఆనాటినుంచి సుభద్ర అర్జునునికి పరిచర్యలు చేస్తూవున్నది.

సమేతంగా ఇంద్రప్రస్థం చేరుకున్నాడు. ఐతే ఇంటికి చేరడానికి ముందు సుభద్రతో అర్జునుడు ఇలా అన్నాడు. "ఎవరికీ చెప్పకుండా నిన్ను వివాహం చేసుకున్నాను. ముఖ్యంగా ద్రౌపది నిన్ను చూడగానే ఏమంటుందో. కనుక ఒక ఉపాయం చేతాం. నీవు గోపాల బాలికతో కలిసి ముందు మా యింటికి వెళ్లు. వెళ్లి ఆమెకు నమస్కరించు. ఆమె దీవించిందంటే ఇకబాధలేదు. మనం ఇద్దరం కలిసి వెళ్ళితే ఆమె అప్రియములు పలుకవచ్చును. ఆమె పతివ్రత. ఆమె పలుకులు నిజమవుతయి. అందుకోసం నీవు మొదటవెళ్ళు." సుభద్రకు ఈ సలహా నచ్చింది.

## సు భ ద్రా ర్జు ను లు

సుభద్ర గోపాల బాలికతో వెళ్ళి మొదట కుంతికి, తర్వాత ద్రౌపదికి నమస్కరించింది. ద్రౌపది ప్రేమతో ఆమెను లేవనెత్తి, "తల్లీ! నీ భర్త శత్రు వీరుల విజయుడు అగుగాక! నీవు వీరపుత్ర జననివగుము" అని ఆశీర్వదించింది.

ఆపిమ్మట అర్జునుడు వచ్చి తల్లికీ, అన్నలకూ సవినయంగా నమస్కరించినాడు. వారు అతన్ని మెచ్చి ఆశీర్వదించినారు.

అర్జునుడు క్షేమంగా సుభద్రతోగూడా ఇంద్రప్రస్థం చేరుకున్నాడని తెలిసి కృష్ణుడు బలదేవ, సాత్యకి, ప్రద్యుమ్న, వసుదేవాదులతో కలిసి అనేక వస్తు వాహనాలు తీసుకొనివచ్చి తన చెల్లెలికి అరణం ఇచ్చినాడు. అర్జునుని వివాహ సందర్భంగా ఇంద్రప్రస్థంలో ఆటలూ, పాటలూ, ఉత్సవాలు జరిగినవి. జనం అంతా ఆనందంతో పండుగలు చేసుకున్నారు.

కొన్నాళ్ళకు అర్జునునికీ సుభద్రకూ అభిమన్యుడు ఉద్భవించినాడు. అతడు గొప్ప పరాక్రమవంతుడుగా ఆ తరువాత లోకంలో పేరుపొందినాడు. ద్రౌపదికి అయిదుగురు కుమారులు "ఉపపాండవులు" జన్మించినారు.

## వాహ్యాళికి వెళ్లిన బావమరదులు

ఎండకాలం లోకంలో ప్రవేశించింది. కృష్ణార్జునులు ఇంద్రప్రస్థపురం విడచి దూరంగా వనవిహారానికి వెళ్లినారు. దట్టమైన వృక్షాల చల్లని నీడలలో సెలయేళ్ళ పంచలలో విహరిస్తూ కాలం గడుపుతున్నారు. వారిద్దరి అన్యోన్యానికి మేరలేదు. ఇలా అరణ్యాలలో కొండలమీద తిరుగుతూ కొన్నాళ్లకు ఖాండవ వనంవైపు వెళ్లినారు. అది చాలా మనోహరమైన వనం. రంగు రంగుల పూలతీగెలు, చందన వృక్షాలు అక్కడ వున్నవి. మంచి చంద్రకాంత శిలావేదికలు, రకరకాల పక్షులు, జంతువులు వున్నవి. అంత గ్రీష్మకాలంలో కూడా అక్కడ ఎంతో చల్లగావుంది.

## అగ్ని దేవునికి అజీర్ణం

ఖాండవ వనవిహారం చేస్తుండగా ఒకనాడు అగ్నిదేవుడు బ్రాహ్మణవేషం ధరించి కృష్ణార్జునులను సందర్శించినాడు. వారితో అగ్ని ఇలా అన్నాడు: "మహాత్ములారా! శ్వేతకి అనేరాజు చేసిన పన్నెండు సంవత్సరాల యజ్ఞంలో రోజూ నేయి తాగితాగి అజీర్ణంచేసింది. నేను అగ్నిదేవుణ్ణి. ఈ అజీర్ణం భరించరాకుండా వుంది. ఐతే చికిత్సకోసం నేను బ్రహ్మవద్దకు పోయినాను. ఆయన నాతో ఇలా అన్నాడు : "నీ అజీర్ణం చాలా భయంకరమైనది. ఈ జబ్బు ఏవైద్యుని మందు తోనూ తగ్గదు. ఐతే యిది తగ్గడానికి ఒకటేమార్గం. అనేక చిత్రవిచిత్రములైన ఓషధులువున్న ఖాండవవనాన్ని నీ ఇష్టంవచ్చినట్టు దహించు. అలాచేస్తే నీకు ఆరోగ్యం కలుగుతుంది."

బ్రహ్మమాటలు నాకు నచ్చినవి. 'సరే' అని ఖాండవ వనానికి వచ్చినాను. కాని ఇంద్రుడు ప్రతి మాటూ నాకు అడ్డువస్తున్నాడు. నన్ను వనం దహించనివ్వ డంలేదు. అతన్ని ఎదిరించి వనాన్ని దహించేశక్తి నాకులేదు. నాజబ్బు రోజు రోజుకు పెరిగిపోతున్నది. మీరు మహావీరులు. నాకుసహాయం చేసి పుణ్యాన పొందండి" అన్నాడు అగ్ని.

సమేతంగా ఇంద్రప్రస్థం చేరుకున్నాడు. ఐతే ఇంటికి చేరడానికి ముందు సుభద్రతో అర్జునుడు ఇలా అన్నాడు. "ఎవరికీ చెప్పకుండా నిన్ను వివాహం చేసుకున్నాను. ముఖ్యంగా ద్రౌపది నిన్ను చూడగానే ఏమంటుందో. కనుక ఒక ఉపాయం చేతాం. నీవు గోపాల బాలికతో కలిసి ముందు మా యింటికి వెళ్లు. వెళ్లి ఆమెకు నమస్కరించు. ఆమె దీవించిందంటే ఇకబాధలేదు. మనం ఇద్దరం కలిసి వెళ్ళితే ఆమె అప్రియములు పలుకవచ్చును. ఆమె పతివ్రత. ఆమె పలుకులు నిజమవుతయి. అందుకోసం నీవు మొదటవెళ్ళు." సుభద్రకు ఈ సలహా నచ్చింది.

## సుభద్రార్జునులు

సుభద్ర గోపాల బాలికతో వెళ్ళి మొదట కుంతికి, తర్వాత ద్రౌపదికి నమస్కరించింది. ద్రౌపది ప్రేమతో ఆమెను లేవనెత్తి, "తల్లీ! నీ భర్త శత్రు వీరుల విజయుడు అగుగాక! నీవు వీరపుత్ర జననివగుము" అని ఆశీర్వదించింది.

ఆపిమ్మట అర్జునుడు వచ్చి తల్లికీ, అన్నలకూ సవినయంగా నమస్కరించినాడు. వారు అతన్ని మెచ్చి ఆశీర్వదించినారు.

అర్జునుడు క్షేమంగా సుభద్రతోగూడా ఇంద్రప్రస్థం చేరుకున్నాడని తెలిసి కృష్ణుడు బలదేవ, సాత్యకి, ప్రద్యుమ్న, వసుదేవాదులతో కలిసి అనేక వస్తు వాహనాలు తీసుకొనివచ్చి తన చెల్లెలికి అరణం ఇచ్చినాడు. అర్జునుని వివాహ సందర్భంగా ఇంద్రప్రస్థంలో ఆటలూ, పాటలూ, ఉత్సవాలు జరిగినవి. జనం అంతా ఆనందంతో పండుగలు చేసుకున్నారు.

కొన్నాళ్ళకు అర్జునునికీ సుభద్రకూ అభిమన్యుడు ఉద్భవించినాడు. అతడు గొప్ప పరాక్రమవంతుడుగా ఆ తరువాత లోకంలో పేరుపొందినాడు. ద్రౌపదికి అయిదుగురు కుమారులు "ఉపపాండవులు" జన్మించినారు.

## వాహ్యాళికి వెళ్లిన బావమరదులు

ఎండకాలం లోకంలో ప్రవేశించింది. కృష్ణార్జునులు ఇంద్రప్రస్థపురం విడచి దూరంగా వనవిహారానికి వెళ్లినారు. దట్టమైన వృక్షాల చల్లని నీడలలో సెలయేళ్ళ పంచలలో విహరిస్తూ కాలం గడుపుతున్నారు. వారిద్దరి అన్యోన్యానికి మేరలేదు. ఇలా అరణ్యాలలో కొండలమీద తిరుగుతూ కొన్నాళ్లకు ఖాండవ వనంవైపు వెళ్లినారు. అది చాలా మనోహరమైన వనం. రంగు రంగుల పూలతీగెలు, చందన వృక్షాలు అక్కడ వున్నవి. మంచి చంద్రకాంత శిలావేదికలు, రకరకాల పక్షులు, జంతువులు వున్నవి. అంత గ్రీష్మకాలంలో కూడా అక్కడ ఎంతో చల్లగావుంది.

## అగ్ని దేవునికి అజీర్ణం

ఖాండవ వనవిహారం చేస్తుండగా ఒకనాడు అగ్నిదేవుడు బ్రాహ్మణవేషం ధరించి కృష్ణార్జునులను సందర్శించినాడు. వారితో అగ్ని ఇలా అన్నాడు: "మహాత్ములారా! శ్వేతకి అనేరాజు చేసిన పన్నెండు సంవత్సరాల యజ్ఞంలో రోజూ నేయి తాగితాగి అజీర్ణంచేసింది. నేను అగ్నిదేవుణ్ణి. ఈ అజీర్ణం భరించరాకుండా వుంది. ఐతే చికిత్సకోసం నేను బ్రహ్మవద్దకు పోయినాను. ఆయన నాతో ఇలా అన్నాడు : "నీ అజీర్ణం చాలా భయంకరమైనది. ఈ జబ్బు ఏవైద్యుని మందుతోనూ తగ్గదు. ఐతే యిది తగ్గడానికి ఒకటేమార్గం. అనేక చిత్రవిచిత్రములైన ఓషధులువున్న ఖాండవవనాన్ని నీ ఇష్టంవచ్చినట్టు దహించు. అలాచేస్తే నీకు ఆరోగ్యం కలుగుతుంది."

బ్రహ్మమాటలు నాకు నచ్చినవి. 'సరే' అని ఖాండవ వనానికి వచ్చినాను. కాని ఇంద్రుడు ప్రతి మాటూ నాకు అడ్డువస్తున్నాడు. నన్ను వనం దహించనివ్వడంలేదు. అతన్ని ఎదిరించి వనాన్ని దహించేశక్తి నాకులేదు. నాజబ్బు రోజు రోజుకు పెరిగిపోతున్నది. మీరు మహావీరులు. నాకుసహాయం చేసి పుణ్యాన పొండి" అన్నాడు అగ్ని.

ఆ మాటలువిని అర్జునుడు ఇలాఅన్నాడు. "అగ్నిదేవా! నీబాధను గుర్తించినాము. ఇంద్రుడి మేఘాలను అడ్డుకుని నీ పనికి సహాయపడే శక్తి మాకు లేకపోలేదు. కాని మేము గ్రీష్మకాలంలో ఇటు విహారానికి వచ్చినాము. నావద్ద ధనుస్సు లేదు. రథంలేదు. శ్రీకృష్ణునివద్దకూడా తగు ఆయుధాలులేవు. నీకు తోడ్పడడం ఎలా!"

## ఆయుధ ప్రాప్తి

ఆమాట వినీ వినడంతోనే అగ్నిదేవుడు పరుగెత్తుకువెళ్లి వరుణదేవుని దగ్గరనుండి గాండీవం తెచ్చినాడు. కపిధ్వజంగల గొప్పరథం తీసుకువచ్చినాడు. అర్జునునికి ఇచ్చినాడు. కృష్ణునికి సుదర్శన చక్రాన్ని, కౌమోదకి అనే గదనూ తెచ్చినాడు.

అవి ధరించి కృష్ణార్జునులు "ఇక నీపని సాగించు. దేవతలూ, రాక్షసులూ కలిసి వచ్చినా నిన్ను ఎదురలేరు" అంటూ అగ్నిదేవుని వీపు తట్టినారు.

విజృంభించి అగ్నిదేవుడు ఖాండవ వనాన్ని నాలుగుదిక్కులనుంచీ దహించడం మొదలు పెట్టినాడు. కృష్ణార్జునులు ఆయుధాలు ధరించి కాపలా కాస్తున్నారు.

వనం తగులబడడం చూచిన వనపాలకులు భయపడి పరుగెత్తుకొనిపోయి ఇంద్రునికి చెప్పుకున్నారు. అగ్నిదేవుడు ఎన్నడులేని ధైర్యంతో వనాన్ని దహించడానికి కారణం గ్రహించలేక పోయినాడు ఇంద్రుడు. వెంటనేవెళ్లి మహావర్షం కురియ వలసిందిగా పుష్కలావర్త మేఘాలకు ఆదేశం ఇచ్చినాడు.

## వర్షాన్ని కట్టివేసిన అర్జునుడు

ఇంద్రుని ఆజ్ఞ ననుసరించి మేఘాలు పది దిక్కులనుండి క్రమ్ముకువచ్చి కుంభద్రోణంగా వర్షాలు కురియించడం మొదలు పెట్టినవి. అర్జునుడు బాణా



అగ్నిదేవునిచే ఖాండవదహనము చేయించుచున్న కృష్ణార్జునులు

లతో వనంమీద ఒక పందిరివంటిది నిర్మించి ఒక్క నీటిచుక్కకూడా వనంమీద పడ కుండా ఏర్పాటుచేసినాడు. నిరాటంకంగా అగ్నిదేవుడు వనభోజనం సాగిస్తున్నాడు.

## ఓడిపోయిన అమరేంద్రుడు

అప్పుడు ఇంద్రుడే స్వయంగా తన సైన్యాలను నడిపిస్తూ వచ్చి కృష్ణార్జు నులతో యుద్ధం చేసినాడు. కృష్ణార్జునుల ధాటికి ఆగలేక రథం దిగివచ్చినాడు. అది చూచి అర్జునుడు వెళ్ళి ఇంద్రునికి నమస్కరించినాడు. ఇంద్రుడు అర్జునుణ్ణి కౌగిలించుకొని పుత్రవాత్సల్యంతో దీవించినాడు. కొన్ని దివ్యబాణాలను ఇచ్చినాడు.

# కౌంతేయుడు చూపిన కరుణ

కృష్ణార్జునుల సహాయంవల్ల అగ్నిదేవుడు ఖాండవవనాన్ని సమూలంగా దహించినాడు. అందులోని ఓషధులూ, జంతువులూ అగ్నిదేవునికి ఆహారమైనవి.



శ్రీకృష్ణునిచే చంపబడనున్న మయునికి అభయమిచ్చిన అర్జునుడు

ఈవిధంగా అగ్నిదేవుడు తన అజీర్ణాన్ని పోగొట్టుకున్నాడు. ఐతే వనాన్ని మంట లంటుకున్నప్పుడు ఆ వనంలో నివసిస్తున్న మయుడనే రాక్షసుడు ఆ మంటలను భరించలేక అరుస్తూ పారిపోసాగినాడు. కృష్ణుడు చక్రంతో వాణ్ణి చంపబోయినాడు! అప్పుడు అతడు భీతిజెంది అర్జునుని శరణుజొచ్చినాడు. అర్జునుడు కృష్ణునికి అడ్డువచ్చి అతన్ని చంపకుండా కాపాడినాడు.

ఆటలాడు ప్రాయమందు
అస్త్రవిద్య నేర్చినాడు
పాటుపడే వయసున
పరమార్థం నేర్చినాడు
ఆదియందే పాండవుల చరితం
అర్జునుని మహోజ్జ్వల కథాచరితం॥

అగ్ని దాహమునకై
అమరేంద్రుని ఎదిరించిరి
మానవులను గాచుటకై
దానవులను సమయించిరి
ధర్మవీరులయ్యా పాండవులు
దయాసాంద్రులయ్యా పాండవులు.



# సభాపర్వము ప్రారంభము

పున్నమ వెన్నెలపోలిక
అన్నిదెసల అలలెత్తిన
పంచపాండవుల కీర్తిని
వంచించెద రెవరు ?

మహా ప్రవాహమ్ముపోలె
మంటిని మింటిని గలిపిన
కౌంతేయుల భుజకీర్తిని
కాదను వారెవరు ?

పరిమళమ్ముపోలె ధరా
వలయమ్మున కలయపారు
పాండుసుతుల మంచితనము
వారించెద రెవరు ?




## మయసభా నిర్మాణము

మయుడు రాక్షసుల విశ్వకర్మ. అనేక విధములైన శిల్పకళలను ఎరిగినవాడు. అగ్నిదేవుడు ఖాండవ వనాన్ని దహించినప్పుడు మయుడు భీతితో పారిపోతుండగా కృష్ణుడు అతన్ని చంపజూచినాడు. అప్పుడు అర్జునుడు అడ్డువచ్చి తనను కాపాడినందుకు మయుడు అర్జునునికి చాలా కృతజ్ఞుడుగా ఉండినాడు. తన కృతజ్ఞతను సూచించుటకై అతడు ధర్మరాజువద్దకు వచ్చి "ప్రభూ! అర్జునుడు నాకు ప్రాణ దానం చేసినాడు. నేను శిల్పిని. కృతజ్ఞతా సూచకంగా మీకు ఏదైనా ఒక చిత్రమైన దాన్ని నిర్మించి ఇవ్వదలచుకున్నాను. ఏది నిర్మించాలో సెలవివ్వండి" అన్నాడు. అందుకు కృష్ణుడు ఇలా అన్నాడు :

"ధర్మరాజు చాలా గొప్పరాజు. ప్రపంచములోని రాజులంతా ఆశ్చర్యపడేటంతటి చిత్రమైన మణిమయమైన సభ నొకదానిని ఆయనకు నిర్మించియివ్వు." అందుకు మయుడు చాలా ఆనందపడ్డాడు. "దేవలోకంలో ఉండే భవనం వంటిది నిర్మించియిస్తాను" అన్నాడు మయుడు. వెనుక వృషపర్వుడనే వానికి ఒక సభ నిర్మించి ఇవ్వాలనుకుని తాను పోగుచేసి పెట్టిన నానావిధాలైన రత్నరాసులను తెచ్చి సభాభవనం నిర్మించినాడు.

## గృహప్రవేశం

ధర్మరాజు గృహప్రవేశం రోజున పదివేలమంది బ్రాహ్మణులకు భోజనం పెట్టినాడు. సామంతరాజులు ఏనుగులను, గుర్రములను, మాణిక్యాలను, బంగారాన్ని

విశేషంగా తెచ్చి ధర్మరాజుకు కానుకలుగా ఇచ్చినారు. గృహప్రవేశ ముహూర్తా
నికి మార్కండేయ, మాండవ్య, శౌనకాది మహర్షులు యెందరో వచ్చినారు.
ధర్మరాజును ఆయన నలుగురు తమ్ములను, ద్రౌపదిని ఆశీర్వదించినారు. ధర్మ
రాజు వారందరినీ పూజించినారు. తగురీతిని సత్కరించినారు. మునులంతా
మయుడు ధర్మరాజుకు నిర్మించియిచ్చిన సభను సందర్శించి ఆశ్చర్యపడ్డారు. ఆ
సభంతా మణులు పొదిగిన మాలాలతోను స్తంభాలతోను అందంగావుంది. అందులో
ప్రత్యేకత ఏమిటంటే చూచేవాళ్లకు నీళ్లు లేనిచోట వున్నట్లుగానూ, ఉన్నచోట
లేనట్లుగానూ, తెరచివున్న తలుపు మూసివున్నట్లుగానూ, మూసివున్నతలుపు తెరచి
ఉన్నట్లుగానూ కనిపిస్తుంది. పల్లపునేల ఎత్తుగాను, ఎత్తునేల పల్లంగాను అనిపిస్తుంది.

## నారదుని రాక

మయుడు సభామండపము నిర్మించడం, అందులో గృహప్రవేశం జర
గటం అందరికీ ఆనందాన్ని కలిగించింది. ఒకనాడు నారదుడు మయసభ చూడటా
నికి పాండవులతో ముచ్చటించటానికి వచ్చినారు. పాండవులు ఆయనకు ఘనంగా
స్వాగతం చెప్పినారు. సత్కరించినారు. తరువాత ఆయనకు వివరంగా మయ
సభలోని విశేషాలు చూపించినారు. అది చూచి నారదుడు ముగ్ధుడై "ఇట్టి సభ
ప్రపంచంలో మరెక్కడా లేదు. ఇంద్రసభ, కుబేరసభ, యమసభ, వరుణసభల
కంటె కూడా అందంగాను, విచిత్రంగాను వున్నది. మీవంటి మహావీరులకు ఇట్టి
సభ అవసరం. మీరు ఎంతవారులో అంత సుగుణులు. కనుక లోకం అంతా
మిమ్ములను ప్రశంసిస్తున్నది. ఇందుకు తోడుగా మీరు రాజసూయయాగం కూడా
చేసినారంటే మీకీర్తికి అంతుండదు. మీరు నాలుగుదిక్కులూ జయించి వచ్చి
రాజసూయయాగం చేయండి. దానివల్ల మీ తండ్రి ఇంద్రలోకం చేరుకుని సుఖంగా
వుండగలడు" అన్నారు.

ఆయన ఇంకా ఇలా అన్నాడు. "ఈ కోర్కె నాది మాత్రమేకాదు. మీ తండ్రి పాండురాజుది. ఇటీవల నేను యమసభకు వెళ్ళినాను. అక్కడ ఆయన నాకు కనుపించినాడు. 'హరిశ్చంద్రుడు రాజసూయంచేసి తన పితృదేవతలకు ఇంద్రలోకప్రాప్తి కలిగించినట్లు, నా కుమారుడు ధర్మరాజు రాజసూయం చేయడం నా అభిమతం' అన్నాడు. ఈ విషయం మీకు చెప్పుమని నన్ను కోరినాడు." తమ తండ్రి నారదుని ద్వారా తమకు పంపిన ఆదేశాన్ని పాండవులు అంగీకరించినారు.

ఐతే ఇది చాల పెద్దపని. కనుక శ్రీకృష్ణునితో ఈ విషయం ఆలోచించినారు. ఆయన పాండవుల అభిమతం విని చాలా సంతసించినాడు. ఆయన ధర్మరాజుతో "బావా! నీ సంకల్పం మంచిది. నాలుగు దిక్కులనూ జయించగల మహావీరులైన నలుగురు తమ్ములుగల నీవుగాక ఇంకెవ్వరు ఈ యాగం చేయగలరు? ఈ రాజసూయయాగంవల్ల నారదుడన్నట్లు మీ తండ్రి ఇంద్రలోకాన్ని పొందగలడు. ఐతే నాలుగు దిక్కులు గెలవడంలో మొదట ఒకచిక్కువుంది. మొదట మగధదేశం రాజైన జరాసంధుణ్ణి వధించవలెను. వాడు ప్రస్తుతం లోకకంటకుడుగా వున్నాడు. వానివల్ల చాలామంది బాధలు అనుభవిస్తున్నారు. వాడు చాలా బలవంతుడు. శిశుపాలుడు వానికి సేనాపతి. ఇంకా చాలామంది రాజులు వానివెంట వున్నారు. జరాసంధుణ్ణి ఆయుధయుద్ధంలో జయించలేము. వాణ్ణి భీమునిచే మల్లయుద్ధంలో చంపించాలి" అన్నాడు.

## పాండవుల జైత్రయాత్ర

పాండవులు కృష్ణుని రాజనీతికి చాల సంతసించినారు. "బావా ! నీవుచెప్పిన సలహా బాగావుంది. మొదట జరాసంధుణ్ణి వధించితీరాలి" అన్నారు పాండవులు.

పాండవుల ఏకాభిప్రాయానికి సంతసించి శ్రీకృష్ణుడు భీమార్జునులను వెంటతీసుకొని జరాసంధుణ్ణి వధించటానికి బయలుదేరినారు. ఐతే వారు వెళ్ళేటప్పుడు బ్రాహ్మణ వేషాలను ధరించినారు.

బ్రాహ్మణవేషాలతో శ్రీకృష్ణుడూ, భీముడూ, అర్జునుడూ గిరివ్రజపురం చేరుకున్నారు. ఎట్టి ఆటంకం లేకుండా రాజమందిరంలో ప్రవేశించినారు. ఎవరో బ్రాహ్మణోత్తములు వచ్చినారనుకొని జరాసంధుడు "బ్రాహ్మణోత్తములారా! నమస్కారములు. మీరు ఏంకావాలో అడగండి. అడిగిందల్లా ఇస్తాను" అన్నాడు.

"మాకు యుద్ధం కావాలి. మేం బిచ్చం ఎత్తడానికి రాలేదు. నేను కృష్ణుణ్ణి. వీరు భీమార్జునులు. ఇక వెనుదీయకుండా యుద్ధానికిరా" అన్నాడు కృష్ణుడు.

## చకితుడైన జరాసంధుడు

కృష్ణుని మాటలువిని జరాసంధుడు ఆశ్చర్యపడి "కృష్ణా! మీకు నేను ఎన్నడూ యెట్టి అపకారం చేయలేదు. మీరూ నాపై ఎన్నడూ శత్రుత్వం వహించలేదు. ఇవాళ ఈ యుద్ధం తలపెట్టడానికి కారణం ఏమిటి?" అని అడిగినాడు. అతడు ఇంకా ఇట్లా అన్నాడు: "నేను దేవతలకూ, మునులకూ, బ్రాహ్మణులకూ భక్తుణ్ణిగా వుంటున్నవాణ్ణి. ఉత్తమక్షత్రియుణ్ణి. నేనేంతప్పు చేసినాను?"

అందుకు జవాబుగా కృష్ణుడు "నీవు చేయనిపాపంలేదు. రాజులను చెరపట్టినావు. సాధుజనులను హింసించినావు. అట్టినీవు మాకు శత్రుడవు. నీవు నీ ప్రాణాలు దక్కించుకోవాలంటే చెరపట్టిన వారినందరినీ విడిచిపెట్టు" అన్నాడు.

"సేవార్థము తెచ్చి చెరలో వుంచిన రాజులను విడిచిపెట్టటం అసిద్ధం. యుద్ధానికి నేను సిద్ధమే. నేను ఒక్కణ్ణే మీ ముగ్గురితో యుద్ధంచేయగలను. ఏ ఆయుధంతో అంటే ఆ ఆయుధంతోనే యుద్ధంచేస్తాను" అన్నాడు జరాసంధుడు.

అప్పుడు కృష్ణుడు "నీ ఒక్కనితో మేము ముగ్గురము యుద్ధంచేయుట ధర్మంకాదు. మాలో నీకు ఇష్టంవచ్చినవాణ్ణి ఒక్కణ్ణి కోరుకో. అతడు మల్ల యుద్ధంలో నిన్ను జయిస్తాడు" అన్నాడు. జరాసంధుడు భీముణ్ణి కోరుకున్నాడు.

మల్లయుద్ధం ప్రారంభం అయింది. సమానబలంగల భీమ జరాసంధులు ఘోరంగా పోరాడినారు. ఒకరిబుజం ఇంకొకరిబుజానికి తాకడంవల్ల కలిగిన చప్పుడు ప్రపంచం అంతా మారుమ్రోగింది. వారు మల్లయుద్ధంచేస్తుంటే సింహం యేనుగు పోరాడినట్లు, వజ్రాయుధం పర్వతం తలపడినట్లు అనిపించింది. ఆ యుద్ధం చతుర్దశిదాకా సాగింది.

చతుర్దశి రాత్రి జరాసంధుడు బాగా అలసిపోయినాడు. అదిచూచి భీమునితో కృష్ణుడు ఇలాఅన్నాడు: "యిటుచూడు, వాయుపుత్రా! జరాసంధుడు అలసిపోయినాడు. నీ తండ్రియైన వాయుదేవునిబలం, నీ బలం మాకు కనపడేట్టు విజృంభించి జరాసంధుణ్ణి చంపు".

## జ రా సం ధ వ ధ

కృష్ణుని ప్రబోధం ప్రకారం భీముడు తన తండ్రియైన వాయుదేవుణ్ణి తలచుకుని, విజృంభించి జరాసంధుని మీద దూకినాడు. జరాసంధుణ్ణి పట్టి పైకి ఎత్తినాడు. ముక్కులోనించి, నోటిలోనించి, చెవులలోనించి నెత్తురు సొడసొడ కారేట్టుగా

నూరు సార్లు జరాసంధుణ్ణి ఊపినాడు. వాని సందు ఎముకలన్ని విరిచి పారవేసి నాడు. విజయగర్వంతో పెద్దగా అరచినాడు.



జరాసంధుని చీల్చి సంహరించుచున్న భీముడు

ఆ చప్పుడు విని లోకులంతా భూమిపగిలిందో, హిమాచల శిఖరం ముక్కలైందో, అనుకున్నారు. జనానికి జరాసంధుడు చచ్చినట్లు తెలవడానికి వాని మృత శరీరాన్ని భీముడు తోరణద్వారం దగ్గరికి విసరివేసినాడు.

## మురిసిపోయిన ముల్లోకాలు

జరాసంధుడు చెరబట్టిన రాజులంతా విముక్తి పొందినారు. శ్రీకృష్ణుడు భీమార్జునులతో కలిసి గరుత్మంతుడు రథసారథ్యం చేయగా ఇంద్రప్రస్థం చేరుకున్నాడు. ఏ ఆయుధంతో గూడా చావని జరాసంధుణ్ణి భీముడు చంపినందులకు లోకులు చాలా హర్షించినారు.

## రాజసూయయాగం

ఆ తరువాత ఉత్తరానికి అర్జునుడు, దక్షిణానికి సహదేవుడు, తూర్పునకు నకులుడు, పడమర దిక్కునకు భీముడు వెళ్ళి అందరు రాజులనూ జయించి వచ్చినారు. ఇక రాజసూయయాగానికి ఎట్టి ఆటంకంలేదు గనుక ధర్మరాజు ముహూర్తం నిశ్చయించి రాజులందరినీ ఆహ్వానించినాడు.

హస్తినాపురం నుంచి కౌరవులంతా వచ్చినారు. ధర్మరాజు యజ్ఞ నిర్వహణలో వారిసహాయంకూడా తీసుకున్నాడు. యజ్ఞం చాలా విజయవంతంగా జరిగింది.

అప్పుడు భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు. "నాయనా! నీవు నీ తమ్ముల సహాయంతో దిగ్విజయం చేసినావు. ఆ తరువాత చాల విజయవంతంగా రాజసూయయాగంకూడ చేసినావు. ఈ సభలోవున్న పెద్దలలో శ్రేష్ఠుడైన ఒకరికి ముందుగా అర్ఘ్యం ఇవ్వవలసింది" అన్నాడు.

## వాసుదేవునికి అర్ఘ్యం

"తాతా! ఇందరు పెద్దలలో శ్రేష్ఠులెవరో నీవేచెప్పు. అతనికే మొదట అర్ఘ్యం ఇస్తాను. నీకన్న ఈ విషయం నిర్ణయించగలవాడు మరొకడులేడు"

అన్నాడు భీష్మునితో ధర్మరాజు. "ఐతే విను. భూమి ఆకాశాలలో శాంతిని వ్యాపింప జేసే సూర్యునివలె శ్రీకృష్ణుడు తన నిర్మల కాంతిచే సకలజనులకు తేజస్సును ఇస్తున్నాడు. ఆ మహానుభావుడు ఈ సభలో ఉండగా ఇతరులకు మొదట అర్ఘ్యం ఎట్లా ఇస్తావు? ఆయనే మొదట అర్ఘ్యం పొందటానికి అర్హుడు" అన్నాడు భీష్ముడు.



ధర్మరాజు శ్రీకృష్ణుని కర్ఘ్య మొసంగుట

## శిశుపాలుని అసహనం

ధర్మరాజుకు భీష్ముని మాటలు చాలా సంతోషాన్ని కలిగించినవి. ధర్మరాజు శ్రీకృష్ణుని పూజించి ఆయనకు అర్ఘ్యం ఇచ్చి సన్మానించినాడు. అది చూచి

సభాసదులు అంతా ఆనందించినారు. కాని చేదిదేశపురాజగు శిశుపాలుడు శ్రీకృష్ణుడు అర్ఘ్యం పొందడాన్నిచూచి అసూయచెందినాడు. ధర్మరాజును, భీష్మనీ, శ్రీకృష్ణుణ్ణీ నిందిస్తూ ఇలా అన్నాడు. "ఇక్కడ రాజఋషులూ, బ్రహ్మఋషులూ, బ్రాహ్మణులూ ఎందరో ఉండగా గొల్లవాడైన కృష్ణుణ్ణి పూజించి ధర్మరాజు తన



కృష్ణుడు శిశుపాలుని వధించి, తనలో ఐక్యము చేసికొనుట

తెలివితక్కువ తనాన్ని ప్రకటించినాడు. భీష్ముడు అజ్ఞానంతో శ్రీకృష్ణునికి అర్ఘ్యం ఇవ్వవలసిందిగా సలహాఇచ్చినాడు. తగుదునమ్మాఅని శ్రీకృష్ణుడు తాను అర్ఘ్యానికి అనర్హుడైకూడ అర్ఘ్యం పుచ్చుకున్నాడు. ఇదంతా మాకు అవమానకరంగావుంది".

శ్రీకృష్ణుడు అతని మాటలువిని "వెట్టివాడా! నీమీద దయదలచినకొద్ది ఇంకా మిడిసిపడుతున్నావు. నీవు నా మేనత్తకొడుకువని ఎన్నోసార్లు నీ తప్పులు క్షమించినాను. నీతల్లికి నేనొక వాగ్దానం చేసినాను. నీవు నూరుతప్పులు చేసేదాకా క్షమిస్తానన్నదే ఆ వాగ్దానం. చాలా ఓపికతో నీ నూరుతప్పులూ క్షమించినాను. ఇంకా నీకు బుద్ధిరాలేదు. నా ఓర్పును నీవు దౌర్బల్యంగా భావిస్తున్నావు" అన్నాడు.

శిశుపాలుడు ఆ మాటలకు పరిహాసంచేస్తూ "నీ దయవల్లనేనా నేను ఇంత కాలం బ్రతికిందీ ? ఏదీ ఇప్పుడేం చేస్తావో చేయి" అన్నాడు.

కృష్ణుని కోపం మితిమీరిపోయింది. రుద్రుడై మండిపడ్డాడు. తన చక్రాయుధాన్ని గిరగిరత్రిప్పి శిశుపాలునిమీదికి విసిరినాడు. అది చండతాండవం చేస్తూ వెళ్ళి సభాసదులంతా చూస్తుండగా వాని మెడ నరికివేసింది.

## దుర్యోధనునికి పరాభవం

రాజసూయానికై వచ్చిన కౌరవులు కొన్నాళ్ళపాటు ఇంద్రప్రస్థంలో సుఖంగా గడిపినారు.

ఒకనాడు దుర్యోధనుడు మయసభ చూడటానికి అందులోకి వెళ్ళినాడు. అడుగడుగునా ఆశ్చర్యంగొలిపే ఆ సభ పాండవులకు ఉన్నందుకు చాలా అసూయపడ్డాడు. అసూయతో సభంతా తిరిగి చూస్తున్నాడు. అతివిశాలమైన ఆ సభ కొంతభాగం చూచేవరకు అలసట అనిపించింది ఒక చలువరాయి కనిపించగా దానిమీద కూర్చున్నాడు. నీళ్ళల్లో కూలబడ్డాడు. ఆ సభా నిర్మాణం ఎట్లా వుందంటే నీళ్ళు చలువరాతివలె కనిపిస్తున్నవి. తడిసిన గుడ్డలతో మెల్లగా లేచి ముందుకు సాగినాడు. ఎదురుగా నీళ్ళు కనిపించినవి. మళ్ళీ ఎక్కడ నీళ్ళలో పడతానో అని భయపడుతూ గుడ్డలు ఎత్తిపట్టుకు నడచినాడు. నీళ్ళులేవు. వట్టి చలువరాయి.

## పక్కున నవ్విన పాండవపత్ని

దుర్యోధనుని పాటు మూరంనుంచి చూస్తున్న ద్రౌపదీ పాండవులు పక్కున నవ్వినారు. ధర్మరాజు దుర్యోధనుని తడిగుడ్డలు మార్పించి పట్టుబట్టలు కట్టబెట్టి, దివ్యాభరణాలు ఉపహారకరించి సత్కరించి పంపినాడు. ద్రౌపది తనను చూచి నవ్వడం అతని మనస్సుకు బాధ కలిగించింది. చాలా సిగ్గుపడ్డాడు.



మయసభలో పరాభవముపొందిన దుర్యోధనుడు. పైనుండి చూచి నవ్వుచున్న ద్రౌపది

హస్తినాపురం చేరుకున్న తరువాత దుర్యోధనుడు రాత్రింబగళ్లు తనకు మయసభలో జరిగిన అవమానాన్ని గూర్చి, పాండవుల అభివృద్ధిని గూర్చి ఆలో

చించసాగినాడు. రోజురోజుకూ ప్రజల ఆదరాన్ని మరింతగా పొందుతూ, అంద రినీ జయించుతూ, గొప్ప రాజులుగా పేరుపొందుతున్న పాండవులను ఎట్లాగైనా కష్టపెట్టాలనుకున్నాడు.

## శకుని దుస్తంత్రం

తన మేనమామ అయిన శకునితో ఆలోచించినాడు. శకుని చాలాదుష్టుడు.



దురాలోచన చేయుచున్న దుష్ట చతుష్టయము

అతడు ఒక ఉపాయం ఆలోచించినాడు. దుర్యోధనునితో ఇలా అన్నాడు: "సుయోధనా ! విచారించకు. నీ మనస్సు శాంతించేట్టు పాండవులను ఉచ్చులో బంధిస్తాను.

అయితే చాలా తెలివిగా ఈ పని చేయవలెను. ధర్మరాజుకు జూదం అంటే ఇష్టం. జూదానికి ఆయన్ను ఆహ్వానింతాం. జూదంలో మాయచేసి అతన్ని ఓడింతాం".

"మాయ ఎలా చేయగలం?"అని సందేహాన్ని వెలిబుచ్చినాడు దుర్యోధనుడు.

"అదంతా నీ కెందుకు? జూదంలో నాకున్న చాకచక్యం మరెవ్వరికీ లేదంటే నమ్ము. నాకూ ధర్మరాజుకూ ఆట ఏర్పాటుచేయి. నేను అతన్ని ఓడించి అతని రాజ్యమంతా నీకు అప్పజెప్పుతాను" అన్నాడు శకుని. ఈ ఉపాయానికి కర్ణుడూ, దుశ్శాసనుడు చాలా సంతోషించారు. దుర్యోధనుడు ధర్మరాజును జూదానికి పిలవడానికి సమ్మతించినాడు. అయితే పిలుపు ధృతరాష్ట్రుని వద్దనుండి వెళ్ళాలి.

అందుకోసం దుర్యోధనుడు తండ్రి వద్దకు వెళ్ళి "ఎలాగైనా ఒకమాటు పాండవులను హస్తినాపురానికి ఆహ్వానించు" అని బలవంతం చేసినాడు.

తనకు ధర్మరాజును జూదంకోసం పిలవడం ఇష్టంలేకపోయినా కొడుకు మాటను కాదనలేక పోయినాడు ధృతరాష్ట్రుడు. ధర్మరాజును ఆహ్వానించి రావలసిందిగా విదురుణ్ణి ఇంద్రప్రస్థపురానికి పంపించినాడు.

ధృతరాష్ట్రుని ఆజ్ఞప్రకారం విదురుడు ఇంద్రప్రస్థం వెళ్ళి పాండవులను జూదం ఆడడానికి రమ్మని ఆహ్వానించినాడు. జూదమంటే చెవికోసుకునే ధర్మరాజు వెంటనే ఆహ్వానాన్ని అంగీకరించినాడు. ఐతే మనసులో ఎందుకో కొంత సందేహం ఏర్పడింది. ఐనా తన తమ్ములతో, పరివారంతో హస్తినాపురం చేరుకున్నాడు.

## మాయా ద్యూతం

జూదం ప్రారంభమయింది. దుర్యోధనుని తరఫున శకుని, పాండవుల తరఫున ధర్మరాజు జూదం ఆడసాగినారు. శకుని కపటద్యూతం సాగించినాడు.

ప్రతి పందెం ధర్మరాజు ఓడుతున్నాడు. ఓడిపోతున్నకొద్ది ధర్మరాజుకు ఉక్రోశం హెచ్చింది. తనరాజ్యంలోని ధనాగారంలోని డబ్బునూ, మరకత మాణిక్యాదులను, బంగారాన్ని, గుఱ్ఱాలను, ఏనుగులను, భవనాలను పందెం ఒడ్డినాడు. అన్నీ



మాయజూద సన్నివేశము

కోల్పోయినాడు. జూదంలో తనరాజ్యం పందెంగా పెట్టినాడు. ఓడినాడు. తననూ తన తమ్ములనూ కూడ ఓడినాడు. తుదకు పౌరుషంతో తన ధర్మపత్నియైన ద్రౌపదినికూడా పందెం ఒడ్డి ఓడిపోయినాడు.

## దుర్యోధనుని దుర్బుద్ధి

ఆట ముగిసింది. పాండవులు కౌరవులకు దాసులైనారు. కౌరవులంతా సంతోషంతో కోలాహలం చేయడం మొదలు పెట్టినారు. పెద్దలైన భీష్మ ద్రోణాదుల మనస్సులు చివుక్కుమన్నవి.

ఇక దుర్యోధనుడు ప్రతీకారం తలపెట్టినాడు. నిండు సభలో పాండవులను అవమానం చేయాలనుకున్నాడు. "ద్రౌపదిని కూడా ధర్మరాజు పందెంఒడ్డి ఓడినాడు. కనుక ఆ విషయం ఆవిడకు చెప్పి, సభకు పిలుచుకురమ్మ"ని దుర్యోధనుడు ప్రాతికామిని పంపినాడు.

ప్రాతికామి ద్రౌపది వద్దకువెళ్లి ఆ విషయం చెప్పగానే ఆమె ఇలా అంది : "నన్ను ధర్మరాజు పందెంఒడ్డి ఓడినాడంటున్నారు. ఆయన ముందు తనను ఓడినాక నన్ను పందెం ఒడ్డినాడా లేక నన్నే ఓడి తరువాత తాను ఓడినాడా ?" ఈ సందేహం తీర్చుకోడానికి ప్రాతికామి సభకు వచ్చినాడు. "ఈ సందేహం సభలోనే తీర్చుకోవచ్చును గనుక ద్రౌపదిని ఇక్కడికి వెంటనే తీసుకురమ్మన్నాడు దుర్యోధనుడు. ఆ మాటను ప్రాతికామి వెళ్ళి ద్రౌపదికి చెప్పినాడు. ఆమె అందుకు అంగీకరించి సభకు వచ్చింది. వచ్చి గాంధారి వెనుకగా నిలుచున్నది. అది దుర్యోధనునికి నచ్చలేదు.

## దుశ్శాసనుని దుస్సాహసం

సభా మధ్యంలోకి ద్రౌపదిని లాక్కురమ్మని దుర్యోధనుడు దుశ్శాసనున్ని పంపినాడు. అతడు వెళ్ళి ద్రౌపదిని చేయిపట్టి లాగజూచినాడు. "నేను ఏకవస్త్రను. నన్ను ముట్టుకోగూడదు" అన్నది ద్రౌపది. దుశ్శాసనుడు ఆ మాటలు పెడచెవిని పెట్టినాడు. దుశ్శాసనుడు; "నీవు ఏకవస్త్రవైనా వివస్త్రవైనాసరే నిన్ను సభలోకి లాక్కుపోవలసిందే" అంటూ అతడు ఆమె జుట్టుబట్టి లాక్కుని వచ్చినాడు.

## నిప్పు లుమిసిన భీముడు

భీముడు ఆ దృశ్యాన్ని చూచి మండిపడినాడు. "ఓరీ దుశ్శాసనా! నిన్ను చంపి నీ వేడివేడి గుండె నెత్తురుతో ద్రౌపది కురులుముడువకుంటే నేను భీముణ్ణి కాను" అని శపథం చేసినాడు. ఆగ్రహపడడానికి ఇప్పుడు సమయంకాదని అన్నా, తమ్ములు అతన్ని శాంతింపజేసినారు.

సభా మధ్యభాగానికి ఈడ్చుకొని తేబడిన ద్రౌపదిని చూచి నవ్వుతూ దుర్యోధనుడు ఇలా అన్నాడు: "నీ భర్తలు తాము ఓడుటయేగాక నిన్నుగూడా పందెం ఒడ్డి ఓడినారు. ఇక నీకు వాళ్ళు ఎట్టి సహాయం చేయలేరు. ఇప్పటికైనా తెలివి తెచ్చుకొని వచ్చి నాతొడమీద కూచో. నిన్ను రాణిని చేస్తాను."

భీమునికి మళ్ళీ కోపం హెచ్చింది. దుర్యోధనుణ్ణి ఉద్దేశించి ఇలాఅన్నాడు: "నీకు మాతృసమానమైన ద్రౌపదిని అవమానించి తొడపై కూర్చోపెడుతావా? నీ తొడలు విరుగగొట్టకుంటే నేను భీముణ్ణి కాను" అంటూ దుర్యోధనుని మీదికి దూకబోయినాడు. "ఇది సమయం కాద"ని అన్నదమ్ములు భీముణ్ణి శాంత పరచినారు.

## ద్రౌపదీ వస్త్రాపహరణం

పాండవులకు ద్రౌపదికీ ఇప్పటికి జరిగిన అవమానము దుర్యోధనునికి తృప్తిగాలేదు. నిండు సభలో ద్రౌపది చీరెలు ఒలిపించ తలపెట్టినాడు. దుశ్శాసనునికి సైగ చేసినాడు.

దుశ్శాసనుడు ద్రౌపది కొంగుపట్టుకొని చీర విప్పివేయసాగినాడు. అంతా ఆ ఘోరచర్యను చూస్తూ కూర్చున్నారే గాని ఎవ్వరూ ఎట్టి సహాయం చేయలేకపోయినారు. తన భర్తల అసహాయతను ద్రౌపది గుర్తించింది. అప్పుడు ఆమెకు

శ్రీకృష్ణుడు స్ఫురించినాడు. "హేకృష్ణా! హే ద్వారకావాసా! యదునందనా! ఎక్కడున్నావు తండ్రీ! నిండు సభలో మానభంగం జరుపబడనున్న నీ చెల్లెలిని కాపాడు తండ్రీ!" అంటూ అతి దీనంగా ప్రార్థించింది. దుశ్శాసనుడు బలంగా



నిండు సభలో దుశ్శాసనుడు ద్రౌపది చీరను వలుచుట

చీరెను లాగుతున్నాడు. తాను బిగ్గరగా కొంగును పట్టుకున్నది. స్త్రీ ఎంతవరకు రాక్షసునివంటి దుశ్శాసనుని ఎదిరించగలదు? భారమంతా శ్రీకృష్ణుని మీద విడిచి పెట్టింది. తన కొంగును వదిలేసింది. రెండు చేతులెత్తి ఆ పరాత్పరునికి నమస్కరించింది.

## పతివ్రతకు పరాభవమా ?

దుశ్శాసనుడు లాగిన కొద్దీ వలువలు రావడం మొదలుపెట్టినవి. చీరెలు గుట్టలుగా పడినవి. కాని దుశ్శాసనుడు ద్రౌపదిని వివస్త్రనుగా చేయలేకపోయి నాడు. శ్రీకృష్ణుని దయాకటాక్షంవల్ల ద్రౌపది మానసంరక్షణం జరిగింది. దుర్యో ధనాదులు అక్షయంగా వస్తూవున్న వస్త్రాలను చూచి ఆశ్చర్యపడ్డారు. అంతా ద్రౌపదిని కొనియాడినారు.

ధృతరాష్ట్రుడు ద్రౌపది పాతివ్రత్యానికి చాల సంతోషించినాడు. తన కుమారుల దుర్మార్గానికి చాలా దుఃఖపడ్డాడు. ద్రౌపదిని శాంతింపచేయడానికిగాను ధృతరాష్ట్రుడు ఆమెకు వరములివ్వ సంకల్పించినాడు. "అమ్మా! నీశీలం గొప్పది. నీకు జరిగిన అవమానానికి నేనూ దుఃఖిస్తున్నాను. నీ శీలానికిమెచ్చి నీకు రెండు వరాలు ఇవ్వదలచినాను, కోరుకో" అన్నాడు.

"నా భర్తలను దాస్యంనుండి విడిపించు అంతేచాలు" అన్నది ద్రౌపది. ధృతరాష్ట్రుడు పాండవులను విడిపించినాడు. పాండవులు ధృతరాష్ట్రుని ఔదార్యా నికి సంతసించి భార్యాసమేతంగా ఇంద్రప్రస్థపురానికి వెళ్ళినారు.

తన తండ్రి పాండవులను విడిపించడం దుర్యోధనునికి చాలా బాధ కలి గించింది. ఐతే పాండవులతో యుద్ధంచేసే శక్తి తనకు ఎలాగూలేదు. గనుక మళ్లీ జూదంమిషతో ధర్మరాజును ఓడించి అరణ్యాలకు వెళ్ళగొట్టాలనుకున్నాడు.

ఈ మాటు మళ్లీ జూదం జరిగింది. అయితే ఈమాటు ఓడిపోయినవారు పన్నెండు సంవత్సరాలు వనవాసం ఒక సంవత్సరం అజ్ఞాతవాసం జరపవలెను. జూద ములో మళ్లీ శకుని పాల్గొన్నాడు. కుట్రచేసినాడు. ధర్మరాజు మళ్లీ ఓడిపోయినాడు.

నిర్ణయం ప్రకారం ధర్మరాజు తమ్ములతో, భార్యతో అరణ్యానికి బయలు దేరినాడు. ఐతే తల్లి తమ వెంట వచ్చి అరణ్యాల్లో కలిగే అష్టకష్టాలు సహించ లేదని కుంతిని విదురుని ఇంటిలో ఉంచిపోయినారు.

అగ్నివంటి పాంచాలికి
అవమానము జరుగుటయా
అమృతాంశులు పాండుసుతులు
అరణ్యమే శరణ్యమా ?
ఎంతటి విపరీతం మన
యెదలపై విఘాతం ॥

సగము రాజ్యమును వీడి
దీనులవలె పాండుసుతులు
దెసలంబడి పోవుటయా
ఎంతటి విపరీతం మన
యెదలపై విఘాతం ॥

సభలో నందరు జూడగ
సాధ్వి వలువ లొలిపించిన
దురాత్ములే గద్దెపైన
దొరలై కూర్చుండుటయా ?
ఎంతటి విపరీతం ॥మన॥



పాండు నందనుల కిపుడా సంత్రాసం ?
వనవాసం వారికి పావన వాసం ॥

కంటక మార్గములె పూలబాటలుగా
కారడవులె రాజనగరి కోటలుగా
భావించిన మానధనులు
మానధనులు జ్ఞానధనులు

పాండు నందనుల కిపుడా సంత్రాసం ?
వనవాసం వారికి పావన వాసం ॥




## పాండుపుత్రులకు వనవాసం

పాండవులు అరణ్యవాసానికి వెళుతూవుంటే ఇంద్రప్రస్థపురంలోని జనులంతా గోడుగోడున ఏడ్చినారు. చాలామంది నగరం విడిచి పాండవుల వెంట అరణ్యానికి బయలుదేరినారు. ధర్మమూర్తులైన పాండవులు వెళ్లిపోయినాక ఆ నగరంలో నివసించడానికి ఇష్టపడక చాలామంది బ్రాహ్మణులు కూడా అరణ్యానికి వెళ్లినారు. పాండవులు తమవెంట వచ్చిన వారికి అరణ్యంలో ఎట్టి బాధా కలుగకుండా సంరక్షించినారు.

## అర్జునుని తపస్సు

కొన్నాళ్లు అలా అరణ్యవాసం గడుపగా ఒకనాడు వేదవ్యాసుడు వారి వద్దకు వచ్చినాడు. పాండవులు ఆయనను పూజించినారు. వారి సత్కారానికి వ్యాసుడు చాలా సంతసించినాడు. ధర్మరాజును దగ్గరగాపిలిచి ఇలా అన్నాడు : "నాయనా! మీ కష్టకాలం త్వరలో అంతం అవుతుంది. అన్యాయం ఎన్నటికీ నెగ్గదు. మిమ్మల్ని ఇబ్బంది పెట్టినవాళ్ళు తగు ఫలితం అనుభవిస్తారు. మీకూ కౌరవులకూ యుద్ధం అవుతుంది; తప్పదు. అందులో మీకేవిజయం కలుగుతుంది. ఐతే అందుకు కావలసిన ఉత్తమ అస్త్రములను మీరు ఇప్పుడే సాధించుకోవలెను. అర్జునుడు పాశుపతాస్త్రం సంపాదించవలెను. అది శివుని అనుగ్రహంవల్ల దొరుకుతుంది. కనుక అర్జునుడు ఇంద్రకీలాద్రి మీద శివుణ్ణిగూర్చి తపస్సు చేయవలెను."

వ్యాసుని సలహా ననుసరించి అర్జునుడు ఇంద్రకీలాచలంమీద శివునిగూర్చి ఘోరమైన తపస్సు చేయసాగినాడు. శివునికి అర్జునున్ని పరీక్షించాలనిపించింది. శివుడు, పార్వతి ఎరుకవారి వేషంతో అర్జునుడు తపస్సుచేసే ప్రాంతానికి వచ్చినారు. శివుడు ఒక అడవిపందిని అర్జునుని వైపుకు పరుగెత్తించినాడు. అది వచ్చి



పశుపతిని మెప్పించిన పాండవ మధ్యముడు

అర్జునుడు తపస్సుచేసే స్థలాన్ని చెడగొట్టడం మొదలు పెట్టింది. అప్పుడు అర్జునుడు దానిమీద ఒకబాణం వేసినాడు.

సరిగా అర్జునుని బాణం తగిలినప్పుడే ఇంకోవైపునుండి ఇంకోబాణంవచ్చి ఆ పందికి తాకింది. ఇంతలో ఒక ఎరుకువాడు వచ్చి "ఈ పంది నాది. దీన్ని నేను మొదట కొట్టినాను" అన్నాడు. "కాదు నాది. దీన్ని నేను మొదట కొట్టినాను" అన్నాడు అర్జునుడు. ఇరువురికి ఈ విషయం మీద ఘోరయుద్ధం జరిగింది. యుద్ధంలో అర్జునుడు తనదేపై చేయి అనిపించుకున్నాడు. అందుకు మెచ్చి శివుడు పాశుపతాస్త్రం ఇచ్చినాడు దాన్ని ఉపయోగించే క్రమం చెప్పినాడు. ఆ తరువాత ఇంద్రుడు ప్రత్యక్షమై అర్జునుడు శివునంతటివాణ్ణి ప్రసన్నుని చేసుకున్నందుకు మెచ్చి తానుకూడా ఎన్నో దివ్యాస్త్రములను ఇచ్చినాడు. అర్జునుడు తన కుమారుడు గనుక ప్రేమతో తన ఇంద్రలోకానికి తీసుకుపోయినాడు. అక్కడ కొంతకాలం సుఖంగావుండి తరువాత తిరిగి తన అన్నదమ్ముల వద్దకు వచ్చినాడు.

## సైంధవుని దుర్మార్గం

ఒకనాడు పాండవులంతా వేటకుపోగా ద్రౌపది ఒకతె ఆశ్రమంలో వుంది. సైంధవు డనువాడు అదేమార్గాన తన వివాహంకోసం పోతూ ఎంతో అందంగా వున్న ద్రౌపదినిచూచి మోహం చెందినాడు. ఆమెను ఒంటరిగా ఉండడంకూడా ఆతడు గమనించినాడు. రథం దిగివచ్చి పర్ణశాలలో ప్రవేశించినాడు.

"ఒంటరిగా ఈ ఆశ్రమంలో ఉంటున్న నీవెవ్వరు? నీ పేరేమి?" అని అడిగినాడు.

"నేను పాండవులపత్నిని. పాంచాలి అనుదానను. నా భర్తలు వేటాడబోయి నారు. నీ వెవ్వరో గొప్పరాజువలె ఉన్నావు. నా అర్ఘ్యపాద్యాలు స్వీకరించు" అన్నది ద్రౌపది.

"నీ సౌందర్యమే నాకు అర్ఘ్యం, పాద్యం. నీవు బహు అందంగావున్నావు. అడవిగాచిన వెన్నెలవలె ఇక్కడ దిక్కుమాలిన పాండవులతో పడివుండడం




సైంధవుని మందలించుచున్న పాంచాలి

ఏమిటి ? నాతో రా ! మహాసౌధాల్లో ఉంచుతాను'' అంటూ సైంధవుడు ఆమెను బలవంతంగా ఎత్తుకుని రథంమీద ఎక్కించుకుని పారిపోసాగినాడు.

## దురాత్ముని పరాజయం

ఇంతలో పాండవులు వేటనుండి తిరిగివస్తూ ద్రౌపది ఆక్రందనం విన్నారు. ఎవడో దుష్టుడు తమభార్యను దొంగిలించుకొని పోతున్నాడని తెలుసుకున్నారు. కోపంతో ఉగ్రులైనారు. భీముడు సైంధవ సైన్యంమీదపడి ఏనుగులను, గుఱ్ఱాలను, భటులను తనగదతో చితకగొట్టినాడు. అర్జునుడు తనబాణాలతో సైంధవుణ్ణి

గాయపరచినాడు. అప్పుడు సైంధవుడు ద్రౌపదిని రథంనుండి క్రిందదింపి తానే స్వయంగా రథం నడుపుకుంటూ పారిపోసాగినాడు.

## పరాజయమేకాదు పరాభవం

పారిపోయేవాణ్ణి భీముడు పట్టుకుని కట్టివేసి తీసుకొనివచ్చినాడు. దారిలో పిడికిలితో చితకపొడిచినాడు. బాణంతో వానితల గొరిగి వికారంగా తయారుచేసినాడు. ధర్మరాజువద్దకు తీసుకువచ్చినాడు. అతడు సైంధవునికి తగుబుద్ధులుచెప్పి వెళ్ళగొట్టినాడు.

పెండ్లి చేసుకోదానికి అలంకరించుకుని వెళ్ళుతున్న సైంధవునికి ఇంత పరాభవం జరిగింది. ఆ పరాభవాన్ని సహించలేక వివాహం మానుకొని అరణ్యంలో ఈశ్వరుణ్ణిగూర్చి ఘోరతపస్సు చేసినాడు.

అతని తపస్సుకుమెచ్చి ఈశ్వరుడు ప్రత్యక్షమై "ఏమికావలెనో కోరుకో" అన్నాడు. అందుకు అతడు ఈశ్వరునితో "స్వామీ! నాకు పాండవులను జయించే శక్తిని ప్రసాదించు" అన్నాడు. "ఇదేం వరం. పాండవులను నేనేజయించలేను. అయినా నీవు అడిగినావుగనుక ఇవ్వక తప్పదు. అర్జునుడు లేనప్పుడు ఒకరోజు నీవు పాండవులలో మిగతావారిని జయించగలవు" అన్నాడు ఈశ్వరుడు.

## ఇంద్రుడు వేసిన యెత్తు

కౌరవులకూ, పాండవులకూ యుద్ధం తప్పదని అంతా అనుకుంటున్నారు. ఇంద్రుని వరప్రసాదంవల్ల అర్జునుడు పుట్టినాడు. కనుక ఇంద్రునికి అర్జునునిపై పుత్రప్రేమ హెచ్చు. రేపు జరుగనున్న యుద్ధంలో కర్ణునికీ, అర్జునునికీ యుద్ధం జరుగుతుంది. కర్ణుడు సూర్యవరంవల్ల పుట్టినాడు. సూర్యుడు కర్ణునికి కవచకుండలాలు ఇచ్చి, అవి అతని శరీరంమీద ఉన్నంతకాలం అతడు చావడు అని

వరం ఇచ్చినాడు. కనుక ఎలాగైనా తన కుమారుణ్ణి గెలిపించి కర్ణుణ్ణి హతమార్చవలెననే తలంపుతో ఇంద్రుడు ఇలా ఎత్తువేసినాడు.

ఇంద్రుడు బ్రాహ్మణవేషం వేసుకుని కర్ణుని ఇంటికిపోయినాడు. కర్ణుడు గొప్పదాత. బ్రాహ్మణ వేషంలోఉన్న ఇంద్రుణ్ణి గౌరవించినాడు. "అయ్యా! నీకేం కావాలోచెప్పు ఇస్తాను" అన్నాడు. "నాకు మరేమివద్దు, నీ కవచకుండలాలుఇస్తేచాలు"



కవచకుండలాలు దానము చేయుచున్న కర్ణుడు

అన్నాడు ఇంద్రుడు. కర్ణుడు దానం చేయడం విషయంలో ఏమాత్రం వెనుకాడేవాడుకాడు. గనుక వెనుకాముందు ఆలోచించకుండా తన కవచకుండలాలు ఆ బ్రాహ్మణునిచేతిలో పెట్టినాడు. కర్ణుని ఔదార్యం ఇంద్రుణ్ణి ముగ్ధుణ్ణి చేసింది.

## సురపతి మెచ్చిన సూర్యసుతుడు

"కర్ణా! నీ ఔదార్యాన్ని మెచ్చుకున్నాను. నేను ఇంద్రుణ్ణి. నీకు శక్తి బాణం ఇస్తున్నాను. ఇది ఎంతవాడినైనా చంపుతుంది. ఐతే ఇది నీకు ఒక్కసారే ఉపయోగపడుతుంది" అన్నాడు ఇంద్రుడు. శక్తిబాణం కర్ణునికి ఇచ్చి కవచ కుండలాలు తీసుకుని వెళ్ళిపోయినాడు.

## ద్వైతవనంలో పాండవులు

పాండవులు కామ్యవనంనుండి ద్వైతవనానికి మారినారు. అక్కడ ఒక నాడు ధర్మరాజుకు దాహం వేసింది. కొంచెం నీళ్లు తెమ్మని ధర్మరాజు సహదేవుణ్ణి పంపినాడు. ఆతడు దగ్గరలోఉన్న సరస్సుకు వెళ్లి నీళ్లుత్రాగినాడు. అన్నకొరకు తామరాకులో నీళ్ళు పట్టుకున్నాడు. ఇంతలో కండ్లు తిరిగినట్లై క్రిందబడి చచ్చినాడు.

## సర్పముగా మారిన సార్వభౌముడు (నహుషుడు)

భీముడు మహాబలశాలికదా! అతనికి ఏపనీ చేయకుండా ఊరికే కూచోడం గిట్టదు. అందుకని ఏదోపని చేస్తూనేవుంటాడు. ఒకనాడు అతను ఒంటరిగా వేటకు బయలుదేరాడు. అడవిలో ఒక పెద్దపాము హఠాత్తుగావచ్చి భీముణ్ణి బంధించింది. అంత బలశాలియైన భీముడు అపాయమునుండి తప్పించుకోలేక, కదలలేక, మెదలలేక పడి ఉన్నాడు. తన అసహాయతకు తానే సిగ్గుపడ్డాడు. అయితే తనను బంధించినది సామాన్యసర్పముకాదనీ అది ఏ మహానుభావుడో శాపవశ

మున పాముపెచ్చి తనను బంధించి ఉండవచ్చునని ఊహించాడు. సర్పాన్ని ఉద్దే శించి భీముడు ఇలా అన్నాడు. "ఓ సర్పమా! నీవు సాధారణ సర్పానివికావు. ఎందుకంటే పదివేల ఏనుగులను, అనేక రాక్షసజనాన్నీ నిర్లక్ష్యంగా చంపివేయ గల నన్ను నిస్సహాయుణ్ణిచేశావు. నీపేరేమిటో, నీ పూర్వజన్మవృత్తాంతం ఏమిటో చెప్పుము". అప్పుడు ఆ పాము ఇలా అన్నది: "నేను నహుష చక్రవర్తిని. శాపంవల్ల ఇలా పాముజన్మ లభించింది. నా కొన్ని ప్రశ్నలకు సమాధానంలభిస్తే నిన్ను విడిచిపెడతాను, లేకుంటే నిన్ను చంపితింటాను. ప్రశ్నలకు సమాధానమే లభించిందా, నా శాపం తీరిపోతుంది".

అంతలో భీముణ్ణి వెతుక్కుంటూ, ధర్మరాజు అక్కడికి వచ్చాడు. ఆ పాముమాటలు విని ఇట్లా అన్నాడు: "ఓహో! నీవు నహుష చక్రవర్తివా! నీకు ఎంతకర్మ పట్టినది? నీ ప్రశ్నలేమిటో అడుగు. సమాధానం ఇవ్వడానికి ప్రయత్నిస్తాను."

ఆ సర్పం వేసిన మొదటి ప్రశ్న ఇది :—

"ఏ గుణాలున్నవాడు బ్రాహ్మణుడు?"

"దయ, సత్యం, తపస్సు, దానం, శౌచం, సహనం, ఇంద్రియ నిగ్రహం ఉన్నవాడు బ్రాహ్మణుడు" అని సమాధానం చెప్పాడు ధర్మరాజు.

"అన్ని ధర్మాల్లోకి ఏది ఘనమైనది?" అని రెండోప్రశ్న అడిగింది పాము.

"అన్నిటిలోకీ అహింస ఘనమైనది" అన్నాడు ధర్మరాజు. పాము సంతో షించింది. ఇలాగే తక్కిన ప్రశ్నలన్నీ అడిగింది. అన్నిటికీ ఇట్లే జవాబు



సర్పరూపంలో ఉన్న నహుషుడు ధర్మరాజును ప్రశ్నించుట

చెప్పాడు ధర్మరాజు. తుది ప్రశ్నకు సమాధానం వినగానే సర్పం భీముణ్ణి వది లేసింది. తాను చక్రవర్తి రూపందాల్చింది. అతడే నహుషుడు. ధర్మరాజు నహుషుణ్ణి ఆనందంతో కౌగిలించుకున్నాడు. భీముడూ, ధర్మరాజూ ఆ తరువాత తమ ఆశ్రమానికి తిరిగివచ్చారు.

# యక్ష ప్రశ్నలు

ఎంతసేపటికీ సహదేవుడు రాకపోవడంచూచి ధర్మరాజు నకులుణ్ణి పంపినాడు. అతడూ రాలేదు. భీముణ్ణి, అర్జునుణ్ణి పంపినాడు. వాళ్ళూ తిరిగి రాలేదు. ఏం ప్రమాదం జరిగిందో అని భయపడి తానే స్వయంగా సరస్సువద్దకు వెళ్ళిచూడగా నలుగురూ చచ్చి పడివున్నారు. అప్పుడు ధర్మరాజుకు ఎక్కడలేని దుఃఖంవచ్చింది. అదిచూచి ఆ సరోవరం దగ్గరగల యక్షుడొకడు ఇలాఅన్నాడు: "నేను కొన్ని ప్రశ్నలువేస్తాను వాటికి జవాబు సక్రమంగా ఇస్తే నీ తమ్ములు బ్రతుకగలరు." ధర్మరాజు ప్రత్యుత్తరాలు ఇవ్వడానికి సమ్మతించినాడు. యక్షుని కొన్ని ప్రశ్నలు, ధర్మరాజు ఇచ్చిన కొన్ని జవాబులు ఇవి :—

యక్షుడు : దేనివల్ల కీర్తి కలుగుతుంది ?

ధర్మరాజు : దానం చేయడంవల్ల.

యక్షుడు : స్వర్గానికి వెళ్ళడానికీ, సుఖం కలగడానికి ఏం చేయవలెను ?

ధర్మరాజు : సత్యం, శీలం అలవరచుకొనవలెను.

యక్షుడు : ధనం సంపాదించడానికి మంచి సాధనం ఏమిటి ?

ధర్మరాజు : మంచిమనస్సుతో వ్యవహరించడం.

యక్షుడు : ధనాలలో ఉత్తమధనం ఏది ?

ధర్మరాజు : విద్యా ధనం.

యక్షుడు : లాభాల్లో ఉత్తమమైన లాభం ఏది ?

ధర్మరాజు : ఆరోగ్య లాభం.



యక్షప్రశ్నలకు సమాధానమిచ్చుచున్న ధర్మరాజు

యక్షుడు : సుఖాల్లో ఉత్తమ సుఖం ఏది ?

ధర్మరాజు : సంతోషం.

యక్షుడు : శ్రేష్ఠమైన ధర్మం యేది ?

ధర్మరాజు : భూతదయ.

యక్షుడు : ఏంచేస్తే దుఃఖాన్ని జయించవచ్చు ?

ధర్మరాజు : మనోనిగ్రహంవల్ల.

యక్షుడు : ఎవరితో స్నేహంచేస్తే మంచిది ?

ధర్మరాజు : సజ్జనులతో.

యక్షుడు : దేన్ని విడవడంవల్ల మనిషి అందరికీ మంచివాడు అవుతాడు ?

ధర్మరాజు : అభిమానం విడవడంవల్ల.

యక్షుడు : ఏది విడిస్తే మనిషి సుఖపడతాడు ?

ధర్మరాజు : లోభం విడిస్తే.

యక్షుడు : తపం, దమం, క్షమం, లజ్జ, జ్ఞానం, శమం, దయ, సరళత అనేవి వేటికి పేర్లు ?

ధర్మరాజు : స్వధర్మాన్ని విడవకపోవడమే తపస్సు. మనస్సును నిగ్రహించడమే దమం. సుఖాన్ని దుఃఖాన్ని సమానంతో భరించడమే క్షమ. చెడ్డపనులను చేయకుండడమే లజ్జ. సత్త్వాన్ని తెలుసుకోవడమే జ్ఞానం. మనస్సును స్థిరపరచుకోవడమే శమం. అందరిక్షేమాన్ని, సౌఖ్యాన్ని కోరడమే దయ. అందరిపట్ల సమభావమే సరళత.

## యముడే యక్షుడు

ఇలాగే మరికొన్ని ప్రశ్నలు అడుగగా అన్నిటికీ ధర్మరాజు సక్రమంగా సమాధానం చెప్పినాడు. అందుకు సంతోషపడి యక్షుడు చనిపోయిన పాండవులను బ్రతికించినాడు. యముడే మారువేషంలోఉన్న యక్షుడు.

ఇట్లా అనేక కష్టాలకు ఓర్చి పాండవులు విజయవంతంగా పండ్రెండేండ్ల వనవాసం ముగించుకున్నారు.

# అరణ్యవాసం తర్వాత

ఇక ఒక్క సంవత్సరం అజ్ఞాతవాసం చేయవలసివుంది. అజ్ఞాతవాసం అంటే ఎవరికీ తాము పాండవులని తెలియకుండా మారు వేషాలతో ఎక్కడో కాలం గడపవలెను. పాండవులని గనక శత్రువులకు తెలిసిందంటే మళ్ళీ పన్నెండేండ్లు వనవాసం ఒక సంవత్సరము అజ్ఞాతవాసము చేయవలసి వస్తుంది.

బాగాఆలోచించి పాండవులు విరాటరాజువద్ద ఈ యేడాది గడవాలనుకున్నారు. ఐతే వేషాలూ, పేర్లూ మార్చుకోవాలి. ధర్మరాజు బ్రాహ్మణవేషం ధరించి విరాటరాజు సభలో "కంకుడు" అనే పేరుతో రాజుతో పాచికలాడుతూ ఉంటానన్నాడు.

భీముడు వలలుడనే పేరుతో వంటలవానిగా వ్యవహరిస్తానన్నాడు. అర్జునుడు బృహన్నల అనే పేరుతో విరాటరాజు అంతఃపురంలో ఆడపిల్లలకు నృత్యం సంగీతం నేర్పుతానన్నాడు. ఐతే అర్జునుడు ధరించవలసింది స్త్రీవేషం. నకులుడు గుఱ్ఱాలకాపరిగా దామగ్రంథి అనే పేరుతో పనిచేయడానికి సంకల్పించుకున్నాడు. విరాటరాజుకు మంచి గోపాలుడు కావలసి వుండవచ్చును గనుక తంత్రీపాలుడు అనే పేరుతో కొలువు చేస్తానన్నాడు సహదేవుడు.

ఐదుగురికీ మారువేషాలు కుదిరినవి. కాని అతికోమలియైన ద్రౌపది విరాటరాజు ఇంట ఏంపని చేయగలదు? ఇదొక పెద్ద సమస్యగా పాండవులను బాధించడం మొదలుపెట్టింది. ఇలా భర్తలు తననుగురించి ఆలోచిస్తుండగా ఆమె ఇలా అన్నది: "మీరేం విచారించకండి. విరాటరాజు పట్టపురాణి ఐన సుధేష్ణవద్ద పరిచారికగా పనిచేస్తాను. నాకేం బాధలేదు."

ఇలా అంతా తాము చేయవలసిన పనులు, వేసుకోవలసిన వేషాలు నిర్ణయించుకున్నారు. ఒక్క సంవత్సరం అజ్ఞాతవాసం జాగ్రత్తగా గడపడానికి గట్టి ఏర్పాట్లు చేసుకుని, విరాటనగరం ప్రయాణమైనారు. తమ ఆయుధాలను అరణ్యంలో చుట్టినారు. శ్మశానంలోని ఒక పెద్ద జమ్మిచెట్టుమీద వానిని పెట్టినారు. వాటిమీద ఒక శవాన్ని ఉంచి జనం ముట్టడానికి భయపడేట్లు చేసినారు.

విన్నావటగదా అరణ్యపర్వం
విరిగిపోయెగా సైంధవు గర్వం॥

అడవులలో పలు యిడుములనైచీ
ఫలాదులను తిని బ్రతుకును మోచీ
పశుపతినే దైవనము చేసికొని
పార్థుడు పొందెను పాశుపతాస్త్రం ॥విన్నా॥

అరణ్యపర్వం పూర్తయిపోయినది
అజ్ఞాత పర్వమది మిగిలినది
గతమ్ము కథవలె గడచిపోయినది
భవితవ్యం మ్మెటు పరిణమించునో ॥విన్నా॥






అల్లదుగో విరాట నగరమూ
పెనుయెడారి
నలతెత్తిన నీరాకరము॥

దారిచూపు నీడల నదు
గో నడచిరి పాండు సుతులు
దానిప్రేమ చూరగొని ని
దానించిరి ఖిన్నమతులు ॥అల్ల॥

ఏవురు తేజస్వులు అపు
డే వెడలిరి మునుముందే
ఎవరావిడ ? ద్రౌపదియా ?
ఎంత దీనతను బొందె ॥అల్ల॥

పాపమామె సైరంధ్రీ
రూపమ్మును ధరియించెను
మబ్బులోని చంద్రవంక
మాదిరిగా కన్పించెను ॥అల్ల॥



# అజ్ఞాతవాసం ఆరంభం

పంచపాండవులు ద్రౌపదితో మారువేషాలలో విరాటరాజు వద్దకు వచ్చి "మాకు ఉద్యోగాలు ఇప్పించమని అర్జీ పెట్టుకున్నారు. విరాటరాజు వారిని పరీక్షించి తగు పదవులలో నియమించినాడు. ధర్మరాజును తన ఆస్థానంలో ఉండమన్నాడు. భీమున్ణి వంటవాళ్ళలో పెద్దగాచేసినాడు. అర్జునుణ్ణి ఆడపిల్లలకు సంగీతము చెప్ప డానికి నియమించినాడు. నకుల సహదేవులను గుర్రాలు, ఆవులు కాయడానికి నియు క్తులను చేసినాడు. ద్రౌపదిని సుధేష్ణకు దాసీగా ఉంచినాడు. ఆమెను విరాటరాజు అంతఃపురంలో సైరంధ్రి అనే పేరుతో పిలుస్తారు. అందరికి ఉద్యోగాలు లభిం చడంవల్ల ఎవరికివారు గుట్టుగా తమపనులు చూచుకుంటూ కాలం గడుపుతున్నారు.

# సింహబలుని చెడు తలంపు

ఒకనాడు విరాటరాజు బావమరది సింహబలుడనేవాడు తన అక్కయైన సుధేష్ణాదేవిని చూడడానికి అంతఃపురంలోకి వచ్చినాడు. అప్పుడు ద్రౌపదినిచూచి సింహబలుడు మోహితుడైనాడు. ఎలాగైనా ఆమెను అనుభవించాలని నిశ్చయిం చుకున్నాడు. తన అక్కకు తన కోర్కె చెప్పినాడు. "తమ్ముా! ఆపని మంచిది కాదు నాయనా! ఆమె ద్రౌపదివంటి మహారాణివద్ద పరిచారికగా పనిచేసినదట. పాండవులు రాజ్యం కోలుపోవడంవల్ల ఇక్కడికి వచ్చింది. చాలా శీలవతిగావుంది. పైగా ఆమెకు అయిదుగురు గంధర్వులు భర్తలట. వాళ్ళు ఎప్పుడూ ఆమెను రక్షిస్తుంటారట. నీకు వాళ్ళవల్ల ఏమైనా ప్రమాదం రావచ్చు. కనుక ఈ పని మానుకో" అని తమ్మునికి మెత్తగా చెప్పింది సుధేష్ణ. కామం గుండెలో నిప్పులా మండుతుండడంవల్ల సింహబలుడు ఊరుకోలేక పోయినాడు.

"ఎలాగైనా ఏర్పాటుచేయి, అక్కా" అని అక్కను ప్రతిమాలినాడు. తుదకు ఇలా అన్నది: "నేను రేపు సైరంధ్రితో నీకు కల్లు పంపుతాను. అప్పుడు ఆమెతో మాట్లాడి ఎలాగైనా ఒప్పించుకో. బలవంతం మాత్రం చేయకు."

అక్క సలహా సింహబలునికి బాగనిపించింది. తెల్లవారి సైరంధ్రి సుధేష్ణ చెప్పినట్లుగా కల్లు పాత్రతీసుకుని సింహబలుని ఇంటికి వచ్చింది. ఒంటరిగా తన గదిలోకివచ్చి బల్లమీద పానీయపాత్రను ఉంచుతున్న సైరంధ్రిని చూచినాడు. ఆమె సహజ సౌందర్యం అతనికి వెర్రెత్తించింది.

"సైరంధ్రీ! నేను ఎవరినో తెలుసా! నేను కేవలం రాణిగారి తమ్ముణ్ణి మాత్రమే కాదు. ఈ రాజ్యానికి సేనాపతిని. నాకు నీమీద కోర్కెవుంది. అనుగ్రహించు" అన్నాడు.

"అంత పెద్దవాడవు. నీకు ఈ బుద్ధి ఏమిటి? నేను దాసీదాన్ని. రాజులు దాసిదాన్ని కోరవచ్చునా? ఏదేశపు రాకుమారినైనా పెండ్లాడి సుఖపడు" అన్నది ద్రౌపది.

"నీవే కావాలి. నాకు మరెవ్వరూ వద్దు" అంటూ సింహబలుడు ద్రౌపదిని పట్టుకున్నాడు. అప్పుడు ద్రౌపదికి ఏమి చేయడానికి తోచలేదు. ఐతే అతన్ని అప్పుడు నిరాకరించడంవల్ల ప్రమాదం తప్పదనుకుంది. అంతలో ఒక యెత్తు తోచింది. ఆమె అతనితో ఇలా అన్నది: "పట్టపగలు ఇలాచేయడం మంచిదికాదు. నీకోర్కె తీర్చడానికి నేను ఒప్పుకుంటాను. ఇవాళ రాత్రికి ఉత్తరకుమారి నృత్యం నేర్చుకునే నర్తనశాలకు రా. అక్కడికి నేనూవస్తాను. నీకోర్కెతీరుస్తాను."

అందుకు సింహబలుడు చాలా సంతోషించినాడు. ఎలాగో సింహబలుణ్ణి తప్పించుకుని వెళ్ళి భీమునికి రహస్యంగా ఈ విషయం చెప్పింది. ద్రౌపదిచూపిన తెలివి తేటలకు భీముడు మెచ్చుకున్నాడు.

# కీచకవధ

అన్నట్టుగానే ఆ రాత్రి సింహబలుడు నర్తనశాలకు వచ్చినాడు. అంతకు ముందే భీముడు ఆడవేషం వేసుకుని అక్కడకువచ్చి వున్నాడు. "సైరంధ్రీ !"అని పిలిచినాడు సింహబలుడు. భీముడు పరకొంగు ముసుగు పెట్టుకుని సింహబలుడి



కీచకుడు సైరంధ్రివేషములోనున్న భీముని లేపుట . కీచకుని చంపుచున్న భీముడు

దగ్గరకు వచ్చినాడు మోసంతో. సింహబలుడు భీముణ్ణి సైరంధ్రి అనుకుని కావిలించుకున్నాడు. ఇదే సమయమని భీముడు వాని డొక్కలో ఒక్క తన్ను తన్నినాడు. ఆ తన్నుకు "చస్తిని"అంటూ సింహబలుడు నేలగూలినాడు. అప్పుడు

భీముడు వాని మీదపడి చావ బాదిచి వాని చేతులూ కాళ్లు వాని డొక్కలోకిదోపి శరీరాన్ని ముద్దలాచేసి అక్కడే పారవేసి ద్రౌపదికి ఈవార్త చెప్పి వెళ్ళిపోయినాడు.

తెల్లవారి సింహబలుని తమ్ములు నూటుగురువచ్చి అన్నశవాన్ని చూచినారు. సైరంధ్రి భర్తలని చెప్పబడుతున్న గంధర్వులే ఈపనిచేసినారు అని నిశ్చయించుకున్నారు. ఐతే ఇందుకు సైరంధ్రియే కారణమని భావించి అమాయికంగా అక్కడ నిలబడిఉన్న ద్రౌపదిని సింహబలుని శవంతోకట్టి శ్మశానానికి తీసుకుపోయినారు. సింహబలునితో ద్రౌపదినికూడా కాలపెట్టాలని వాళ్ళ తలంపు.

ఇది తెలిసి భీముడు వేషంమార్చుకొనివెళ్లి నూటుగురు ఉపకీచకులనూ చంపి ద్రౌపదిని విడిపించినాడు. ద్రౌపది మళ్లీ అంతఃపురానికి వెళ్లి సుఖంగావున్నది.

## దుర్యోధనుని దురాలోచన

నూటుగురు ఉపకీచకులనూ, సింహబలుణ్ణీ గంధర్వులు చంపినారని, ఆ గంధర్వులైదుగురనీ, ఆ అయిదుగురికీ ఒకటేభార్య అనీ, అది సుధేష్ణకు దాసీగా ఉంటున్నదనీ దుర్యోధనునికి తెలిసింది. వీళ్ళంతా పాండవులేమోనని అనుమానించినాడు. అంతేగాక విరాటరాజు మొదటినుండీ కౌరవులకు పగవాడు. సింహబలుడు సేనాపతిగా ఉండడంవల్ల విరాటరాజును కౌరవులు జయించలేకపోయినారు. ఇప్పుడు సింహబలుడు చచ్చినాడు. ఒక దెబ్బతో రెండు పనులు చేయవచ్చు. పాండవుల అజ్ఞాతవాస రహస్యాన్ని బయలుపెట్టవచ్చు, విరాటరాజును జయించనూ వచ్చు. ఇలా పాండవులరహస్యం బయటపడితే వారు మళ్ళీ అరణ్యవాసం చేయవలసి వుంటుంది.

ఈ తలంపుతో దుర్యోధనుడు విరాటనగరంమీదికి దండెత్తాలనుకున్నాడు. సింహబలునివల్ల వెనక ఎప్పుడో అవమానింపబడిన సుశర్మ అనేవాడుకూడా పగసాధించాలనే కోర్కెతో సైన్యం తీసుకుని విరాటనగరం మీద దాడిచేసినాడు. విరాటరాజు పశువులన్నింటినీ తోలుకుపోయినాడు.

ఇదివిని విరాటరాజు సుశర్మను వెన్నాడినాడు. యుద్ధం జరిగినది. సుశర్మ విరాటరాజు రథాన్ని విరగగొట్టి ఆయన్ను బంధించి తీసుకుపోతున్నాడు. అది విని ధర్మరాజు భీముణ్ణి సహాయానికి పంపినాడు.

భీముడు సుశర్మ సైన్యాలను చితకగొట్టి, ఏనుగులను చంపి, సుశర్మను మాత్రం విడిచిపెట్టి విరాటరాజును క్షేమంగా ఇంటికి తీసుకువచ్చినాడు.

సుశర్మకూ భీమునికీ యుద్ధం జరుగుతుండగా ఇదే అదనని దుర్యోధనుడు విరాటరాజు ఆవులమందను తోలుకోపోయినాడు. ఆ విషయం విరాటరాజు కుమారుడైన ఉత్తరునికి తెలిసింది. "దుర్మార్గులు ఎంత పనిచేసినారు! నాకు సరియైన రథసారధేవుంటే కౌరవులను జయించి గోవులను మరల్చేవాణ్ణి" అన్నాడు అంతఃపురంలో. "నేను సారథ్యం చేస్తాను" అన్నాడు బృహన్నల. "ఐతే ఇప్పుడే కౌరవులను గెలుస్తాను" అని రథంమీద బయలుదేరినాడు. తన అన్న వీరత్వానికి సంతోషించి ఉత్తర ఇలా అన్నది : "అన్నయ్యా! నీవు చాలా గొప్ప వీరులైన కౌరవుల్ని గెలవడానికి వెళుతున్నావు. వాళ్ళు ఓడిపోయినాక వారి తలపాగాలు రంగురంగులవి పట్టుకురా." "ఓ, లెక్కేంం" అన్నాడు ఉత్తరుడు. "మా అన్నయ్య తేలేకపోతే మీరన్నా తేండి గురువుగారూ" అన్నది ఉత్తర బృహన్నలతో. "మీ అన్న గెలిస్తే అట్లాగే తెస్తా"నన్నాడు బృహన్నల.

## ఉత్తరుని తత్తరపాటు

బృహన్నల రథం నడుపుతుండగా ఉత్తరుడు కౌరవులను వెన్నాడడానికి బయలు దేరినాడు. రథం బహువేగంగా వెళ్లింది. ఒక జమ్మిచెట్టు దగ్గర ఆగింది.

అర్జునుడు ఆ చెట్టుమీద దాచివున్న గాండీవాన్ని, దేవదత్తం అనే శంఖాన్నీ తీసుకుని మళ్లీ రథం నడుపసాగినాడు. రథం కౌరవులసేనను సమీపించింది. సముద్రం వలె ఉన్న ఆ సైన్యాన్ని చూచి ఉత్తరునిగుండె పీచుపీచుమన్నది. "బాబో ఇంటికి పోదాం! పద, నేను వీళ్ళతో పోట్లాడలేను" అన్నాడు ఉత్తరుడు. "ఏం భయం



కౌరవసైన్యమును హడలెత్తించుచున్న అర్జునుడు

లేదు" అంటూ బృహన్నల (అర్జునుడు) రథాన్ని మరీవేగంగా నడిపించినాడు. "బాబో! నేనే రథంనడుపుతాను, నీవు యుద్ధంచేయి" అన్నాడు ఉత్తరుడు. "సరే" అన్నాడు అర్జునుడు. ఉత్తరుడు రథంనడుపసాగినాడు. అర్జునుడు లక్షలసంఖ్యలో బాణాలను విడిచినాడు.

## అజ్ఞాతవాసం అయిపోయింది

అదిచూచి కౌరవులు ఇతడు అర్జునుడే అని తెలుసుకున్నారు. "అజ్ఞాత వాసం చెడింది" అని అరవడం మొదలుపెట్టినారు. దుర్యోధనుడుకూడా అందుకు సంతోషించినాడు. మళ్ళీ పాండవులను 12 ఏండ్లు అరణ్యవాసం చేయించవచ్చు ననుకున్నాడు. కాని భీష్ముడు, ద్రోణుడు లెక్కలువేసి చూచి నిన్నటికే పదమూడేండ్లు అయిపోయినై అన్నారు. అదివిని దుర్యోధనుడు నిరాశ చెందినాడు. ఇంతలో అర్జునుడు వచ్చి దుర్యోధనాదులను ఎదుర్కొన్నాడు.

## అర్జునుని దిగ్విజయము

కౌరవులకూ, అర్జునునికీ భీకరమైన యుద్ధం జరిగింది. ఇటుఒక్క అర్జునుడు, అటు కృపాచార్యుడు, దుర్యోధనుడు, దుశ్శాసనుడు, అశ్వత్థామ, కర్ణుడు ఉన్నారు. ఇంతమంది ఉండికూడా అర్జునుణ్ణి ఎదిరించలేక పోయినారు.

చివరకు అర్జునుడు, మోహనాస్త్రం ప్రయోగించినాడు. దానితో కౌరవసైన్యాలన్నీ నిద్రపోయినట్టుగా ఒరిగిపోయినవి.

ఉత్తరుడు ఆవులను విరాటపురానికి మరల్చి, కౌరవసైనికుల పాగాలు కొల్లలుగా ఏరుకుని రథంలో వేసుకున్నాడు. అర్జునుడు ఉత్తరుడు సుఖంగా విరాటపురం చేరుకున్నారు.

## విరాటరాజు వేగిరపాటు

విరాటరాజు ధర్మరాజు (కంకుడు)తో పాచికలాడుతుండగా భటుడువచ్చి ఉత్తరుడు గెలిచినట్లు చెప్పినాడు. అది విని విరాటరాజు చాలా సంతోషించినాడు. ధర్మరాజు అప్పుడు ఇలా అన్నాడు: "బృహన్నలవంటి గొప్పరథసారధి ఉండగా ఉత్తరుడు తప్పక గెలుస్తాడు." అదివిని విరాటరాజుకు కోపంవచ్చింది. పేడిమూతిపాడైన

బృహన్నలను పొగిడి, తన కుమారుని పొగడటంమును నొప్పుకున్నాడు. "వీడుదైన నా కుమారుణ్ణి చిన్నచూపు చూస్తావా ?" అని తన చేతిలోని పాచికతో ధర్మరాజును కొట్టినాడు. దానితో ధర్మరాజు కణతనుండి రక్తం సొడసొడ కారసాగింది. వెంటనే సైరంధ్రి తన పైటకొంగుతో ఆ నెత్తురును నేలన రాలకుండా అద్దింది.



కంకుభట్టును (ధర్మరాజును) పాచికతో కొట్టుచున్న విరాటుడు

## పశ్చాత్తాపం

అంతలో ఉత్తరుడు వచ్చి తన తండ్రికీ, ధర్మరాజుకూ నమస్కారంచేసి "బృహన్నల అర్జునుడు. అతని పరాక్రమం చాలా గొప్పది. అతనివల్ల నేను

కౌరవసేనలను గెలువ గలిగినాను" అన్నాడు. అదివిని విరాటరాజు, తాను కంకు భట్టును కొట్టడం తప్పని గుర్తించి క్షమాపణ వేడుకున్నాడు.

## శ్రీ కృష్ణుని రాక

అదే సమయంలో శ్రీకృష్ణుడు తన చెల్లెలగు సుభద్రను, మేనల్లుడగు అభిమన్యుని వెంటపెట్టుకుని ద్వారకనుండి విరాటనగరానికి వచ్చినాడు. విరాట రాజు ఆయనను ఘనంగా సత్కరించినాడు. తమకు ఆశ్రయమిచ్చిన విరాట రాజును పాండవులు కొనియాడినారు. తనకూ పాండవులకూ ఏర్పడిన స్నేహానికి విరాటరాజు చాలా సంతసించినాడు.

## ఉత్తరాభిమన్యులు

వారికిగల స్నేహబంధాన్ని శాశ్వతంగా ఉంచడానికి కృష్ణుడు విరాట రాజు కూతురగు ఉత్తరను, అభిమన్యుని కిప్పించి వివాహం చేయించినాడు. ఉత్తరాభిమన్యుల వివాహం చాలా గొప్పగా జరిగింది. కల్యాణ సందర్భంగా అలంకరింపబడిన విరాటనగరం స్వర్గంలావుంది.



అయిపోయెనపుడే విరాట పర్వం
వదలె పాండవుల ఆపదలు సర్వం॥

కీచకుని తలపుచేటుల్
ఉత్తరుని ఉత్తమాటల్
ఒకవైపు రోషమ్ము ఒకవైపు హాసమ్ము
నొదవించు పర్వమ్ము ఇది హృదయ పర్వమ్ము ॥అ॥

అర్జునుని దిగ్విజయము
అభిమన్యు కల్యాణము
ఒకదాని వెంట వేరొకటి చక చక సాగ
సిరికన్నెతో అమృత మరుదెంచినటులాయె ॥అయి॥





చెడు తలంపులకన్న స్నేహమ్ము మిన్న
శాంతి మంచిది కదా సమరమ్ము కన్న॥

పదమూడు వర్షాలు కదలి పోయెనుగదా
పాంచాలితో గూడి పాండవులు యిలువీడి
కౌరవులు ఈనాటికైన వారల పిల్చి
సగము రాజ్యమ్ము నీయగ చెల్లునన్నా ॥చెడు॥

తనవోలె సర్వభూతముల జూచెడువాడు
ముల్లోకములచేత పూజలందినవాడు
పరమాత్ముడే రాయబారిగా వచ్చినా
పురికేగ నిది పూర్వపుణ్యమోయన్నా ॥చెడు॥

## శ్రీకృష్ణుని రాయబారం

ఉత్తరాభిమన్యుల వివాహానికి దేశదేశాల రాజులు వచ్చినారు. వివాహం అయినతరువాత వారంతా ఒకచోట సమావేశమై పాండవుల భవిష్యత్తునుగూర్చి చర్చించినారు. ఆ సమావేశంలో పాలుగొన్న వారిలో ముఖ్యులు ద్రుపదుడు, ధృష్టద్యుమ్నుడు, విరాటుడు, శ్రీకృష్ణుడు మున్నగువారు. ఒక్కొక్కరు

ఒక్కొక్కరు అభిప్రాయం వెలిబుచ్చినారు. ముత్తంమీద అంతా ఒక అభిప్రాయానికి వచ్చినారు. అది యేమిటంటే, శ్రీకృష్ణుని కౌరవులవద్దకు రాయబారిగా పంపడం. శ్రీకృష్ణుడు అందుకు అంగీకరించినాడు.

## విదురుని ఇంట విందు

సాత్యకి రథసారథ్యం చేయగా శ్రీకృష్ణుడు హస్తినాపురానికి వెళ్ళినాడు. విదురునింట బసచేసినాడు. శ్రీకృష్ణుడు రాయబారిగా వచ్చినాడని ధృతరాష్ట్రునికి



విదురుని యింట విందారగించుచున్న శ్రీకృష్ణుడు

తెలిసింది. భీష్మ, ద్రోణ, దుర్యోధనాదులు ఆయనను స్వాగతంచెప్పి గౌరవించినారు. అంతా కులాసాగా కబుర్లుచెప్పుకున్నారు. అప్పుడు దుర్యోధనుడు కృష్ణునితో

"నీవు మాతో పాటువుంటి వచ్చినప్పుడు విదురునింటిలో ఎందుకుదిగినావు?" అన్నాడు. "మా మేనత్త ఉండడంవల్ల విదురునింట దిగినాను. పైగా విదురుడు నాకు చాలా ఆప్తుడు"అన్నాడు కృష్ణుడు. "మేము నీకు ఆప్తులంగామా"అన్నాడు దుర్యోధనుడు. "న్యాయంగా ప్రవర్తిస్తే మీరూ నాకు ఆప్తులౌతారు" అన్నాడు కృష్ణుడు. ఆ తరువాత సరస సల్లాపాలతో కాలం గడిచింది.

## సంధి మార్గం

మరునాడు ధృతరాష్ట్రుని సమక్షంలో పెద్ద సభ జరిగింది. సభకు కౌరవులంతా వచ్చినారు. శ్రీకృష్ణుడు దుర్యోధనుని ఉద్దేశించి ఇలాఅన్నాడు : "పాండవులు రెండవసారి జూదంలో ఓడిపోవడం, దాని కట్టుబాటు ప్రకారం పన్నెండేండ్లు వనవాసం, ఒకయేడు అజ్ఞాతవాసం చేయడం జరిగింది. ఇక మీరు వాళ్ళపట్ల శత్రుత్వం వహించడం తగదు. వాళ్ళ సగంరాజ్యం వాళ్ళకు ఇచ్చివేసి అంతా కలసిమెలసి ఉండడం క్షేమం." భీష్ముడు మున్నగు పెద్దలంతా శ్రీకృష్ణుని మాటలను బలపరచినారు.

కాని దుర్యోధనుడు అందుకు అంగీకరించలేదు. చివరకు శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు: "సుయోధనా! పాండవులకు మీతో కలహించాలనిలేదు. ఎలాగైనా సమస్యను పరిష్కరించుకోవాలనుకున్నారు. నేనే తుది పరిష్కార మార్గంకూడా సూచిస్తాను. పాండవులైదుగురికి అయిదుఊళ్ళైనా ఇచ్చివేతివా వారు సంతోషపడతారు. దీనికైనా ఒప్పుకో."

## కృష్ణుని బంధించడానికి కుట్ర

"సూదిమోపినంత నేల కూడా పాండవులకు ఇవ్వను" అన్నాడు దుర్యోధనుడు. కోపంతో సభలోనుంచి వెళ్ళిపోయినాడు. దుశ్శాసనాదులతో ఆలోచించి కుట్రచేసి శ్రీకృష్ణుని బంధించడానికి సిద్ధపడి త్రాళ్ళతో సభలోకి వచ్చినాడు. అది చూచి సాత్యకి ఉగ్రుడైనాడు. "దుష్టులారా! శ్రీకృష్ణ భగవానుని బంధిస్తారా? మీకు ఇప్పుడే తగు శాస్తిచేస్తాను" అని దుర్యోధనాదులమీదికి దుముకపోయినాడు. శ్రీకృష్ణుడు అతన్ని వారించినాడు.

ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో ఇలా అన్నాడు : "శ్రీకృష్ణుని సామాన్య మానవుడుగా భావించి బంధించాలనుకుంటున్నట్లున్నావు. గాలిని పట్టుకోవాలనుకోవడం, పర్వతాలను పెకలించాలనుకోవడం, దావాగ్నిని ముట్టుకోవాలనుకోవడం ఎంత దుష్కరమో, ఇదీ అంత దుష్కరమే. కనుక ఈ పిచ్చిపని మానుకో."

## విశ్వరూపం

శ్రీకృష్ణుడు దుర్యోధనాదులనుచూచి "నన్ను బంధిస్తారా! రండి! బంధించండి" అన్నాడు. ఆకాశమంతయెత్తు పెరిగి తన విశ్వరూపాన్ని చూపించినాడు. అది



కౌరవసభలో విశ్వరూపముచూపుతున్న శ్రీకృష్ణుడు

చూచి దుర్యోధనాదులు మూర్ఛపోయినారు. భీష్మాదులు అత్యానందంతో విశ్వ రూపాన్ని దర్శించినారు. దేవతలు పుష్పవర్షం కురిపించినారు. ఆకాశంలో నారద, తుంబురు ప్రముఖులు నాట్యంచేసినారు. మునులంతా వేదమంత్రాలతో ఆయనను కీర్తించినారు. పుట్టుగ్రుడ్డివాడైన ధృతరాష్ట్రునికి కండ్లు వచ్చినవి. శ్రీకృష్ణుని విశ్వరూపం చూచినాడు. విశ్వరూపాన్ని చూచిన నేత్రాలతో మళ్ళీ ఈ పాపపు లోకాన్ని చూడనొల్లనని మళ్ళీ అంధత్వం పొందినాడు.

## యుద్ధము తప్పదు

కొంతసేపైనాక కృష్ణుడు తన విశ్వరూపాన్ని ఉపసంహరించుకున్నాడు. "ఇక యుద్ధంతప్పదు. దుర్యోధనాదులు ఇంక మూర్ఖులనుకోలేరు. రాజ్యం వీర భోజ్యం గనుక యుద్ధంలో గెలిచినవాడే రాజ్యాన్నిపొందుతాడు" అని చెప్పి శ్రీకృష్ణుడు సభలోనుండి లేచి వెళ్ళిపోయినాడు.

## కర్ణునితో సమాలోచన

రెండవనాడు శ్రీకృష్ణుడు కర్ణుని ఇంటికివెళ్ళినాడు. రథము మీద కర్ణుని ఒక నిర్జన ప్రదేశంలోకి తీసుకొనిపోయినాడు. కర్ణునితో కృష్ణుడు "బావా! నిన్ను అంతా సూతపుత్రుడంటున్నారు. నీవూ అదే నిజం అనుకుంటున్నావు నిజానికి నీవు కుంతి కొడుకువు కనుక పాండవపక్షానచేరు నీవు ధర్మరాజుకంటె పెద్దవాడవు గనుక నీకే సమస్తరాజ్యం లభించుతుంది నీవే రాజవౌతావు" అన్నాడు.

## విశ్వాసం విలువ

అందుకుజవాబుగా కర్ణుడు ఇలా అన్నాడు: "కృష్ణా! చిన్ననాటినుండి దుర్యోధనునితో పెరిగినాను. పెద్దవాడనైనాను. వాళ్ళలో ఒకణ్ణిగా మారిపోయినాను. నాకోసం వాళ్లు చాలాపాట్లుపడినారు. వారికి ద్రోహంచేయలేను. ఏమైనాసరే వారివెంట ఉండవలసిందే. భీష్మద్రోణాదులుకూడా తమకు ఇష్టంలేకపోయినా కౌరవులపక్షం వహించి

ఉన్నారు. నేను పాండవపక్షానికి రావటం కల్ల." కృష్ణుడు ఎంతగానో కర్ణుణ్ణి ఒప్పించడానికి ప్రయత్నించినాడు. కాని లాభంలేకపోయింది. ఇక చేసేది లేక కృష్ణుడు కర్ణుణ్ణివీడి ఒసకు వెళ్ళిపోయినాడు. అయినా కుంతిని పంపి మళ్ళీ ఒకసారి కర్ణుణ్ణి ఒప్పించడానికి ప్రయత్నం చేయాలనుకున్నాడు.

## కర్ణుని యింట కుంతి

రెండవనాడు కుంతి కర్ణుని వద్దకు వెళ్ళింది. "బిడ్డా!" అని అతన్ని కౌగిలించుకుంది. పసిపాపవలె కర్ణుడు ఆమె ఒడిలో దాగినాడు. "నాయనా! నీవు నా



కర్ణుని వరమడుగుచున్న కుంతీదేవి

కొడుకువు. నీ తమ్ములతో పోట్లాడతావా ? ఒకరినొకరు చంపుకోవడం భావ్యమా ? పాండవుల పక్షంచేరు" అని అడిగింది.

"తల్లీ ! నీవు నన్ను కన్నావు. దుర్యోధనుడు నన్ను పెంచినాడు. రాజును చేసినాడు. ప్రాణాల కోసం అతన్ని వదలలేను. పాండవ పక్షానికి రావడం నావల్ల కాదు. క్షమించు. అయితే నేను ఒక అర్జునుణ్ణి తప్ప మరెవ్వరినీ చంపనని వాగ్దానంచేస్తున్నాను. పంచపాండవులు అనే పదాన్ని కాపాడుతాను. యుద్ధంలో నాచే అర్జునుడుచస్తే నాతో కలిసి పంచపాండవులు ఉంటారు. నేను అర్జునునిచేతిలో చస్తే అర్జునునితో పంచపాండవులు బ్రతికి ఉంటారు"అన్నాడు. ఆ మాటలువిని కుంతికి శాంతి, అశాంతి రెండూ కలిగినవి.

కుంతి వలనకూడా పని కుదరకపోవడం చూచి కృష్ణుడు తన రాయబారం విఫలమైనట్టే అని తలంచి ద్వారకకు బయలుదేరి వెళ్ళినాడు. యుద్ధం తప్పక పోతున్నందుకు విచారించినాడు.

## సమర సన్నాహాలు

సంధి కుదరలేదు గనక ఉభయపక్షాలవారు యుద్ధం తప్పదని నిశ్చయించు కున్నారు. ఎవరికివారు యుద్ధ సన్నాహాలు ప్రారంభించినారు. తమ పక్షాన నిలవ గల రాజులను కూడగట్టుకోసాగినారు. సైన్యాలు సమీకరిస్తున్నారు. ద్రుపద విరాటాదులు పాండవుల పక్షాన నిలిచినారు. భగదత్త, భూరిశ్రవాదులు కౌరవులకు తోడునిలిచినారు.

## శ్రీకృష్ణుని సహాయం

గొప్ప రాజనీతిజ్ఞుడైన శ్రీకృష్ణుడు పాండవుల పక్షపాతి. అయినా అతన్ని తమవైపు తిప్పుకోవడానికి లేదా కొంత సహాయమైనా పొందడానికి ప్రయత్నం చేయాలనుకున్నాడు దుర్యోధనుడు.

ఒకనాడు దుర్యోధనుడు ద్వారకకు వచ్చినాడు. శ్రీకృష్ణుని పడకగదిలోకి వెళ్లినాడు. అప్పుడు శ్రీకృష్ణుడు నిద్రపోతున్నాడు. మేల్కొనేదాకా వేచివుండవలసి రావతంవల్ల కృష్ణునితలవైపునగల పీఠంమీద కూర్చున్నాడు. ఇంతలో అర్జునుడు కూడా వచ్చినాడు. అతడు కృష్ణుని కాళ్ళదగ్గరగా గల పీఠంమీద కూర్చున్నాడు.



శ్రీ కృష్ణుని సహాయము కోరుటకై వచ్చిన దుర్యోధనార్జునులు

కొంత సేపటికి కృష్ణుడు మేల్కొన్నాడు. మొట్టమొదట తనకాళ్ళ దగ్గరగా కూర్చున్న అర్జునుడు కనిపించినాడు. ఆ తరువాత తల వెనకకుత్రిప్పి దుర్యోధనుణ్ణి చూచినాడు. ఆశ్చర్యపడ్డట్టు నటించినాడు. "ఇద్దరూ వచ్చినారే!" అంటూ

ఇద్దరినీ కౌగిలించుకున్నాడు: "ఏం పనిమీద వచ్చినారు?" అని అడిగినాడు కృష్ణుడు. అందుకు దుర్యోధనుడు, "బావా! నీవు అందరికీ ఆప్తుడవు మాకూ పాండవులకూ జరుగనున్న యుద్ధంలో మాకు నీవు సహాయం చేయవలెను. నేను సహాయం కోరడానికి మొదలు వచ్చినానుగనుక నాకోర్కె ముఖ్యంగా తీర్చవలెను" అన్నాడు.

# ఏదో ఒకటి

అందుకు బదులుగా శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు: "సుయోధనా! నీవు మొదట వచ్చిఉండవచ్చును గాని నేను మొదట అర్జునుణ్ణి చూచినాను. కనుక మీ యిద్దరికీ నామీద సమానమైన హక్కుంది. మీ యిద్దరికోర్కెలూ నేను తీర్చవలెను, అయితే మొదలు నా శక్తిసామర్థ్యాలు చెబుతాను. మీకు తోచింది అడగండి, ఇస్తాను. నాకు ఒక అద్భుతం యాదవ సైన్యంవుంది. నేనొకణ్ణి వున్నాను. మీలో ఒకరు సైన్యాన్నీ, ఒకరు నన్నూ కోరుకోవచ్చు. అయితే నేను యుద్ధం చేసే వాణ్ణికాదు. ఏవో సలహాలు కావాలంటే ఇస్తాను మీఇద్దరిలో అర్జునుడు చిన్న వాడు గనుక అతన్ని మొదలు కోరుకోనివ్వడం భావ్యం." ఆ మాటలు విని ఇద్దరూ సంతోషించినారు.

"నాకు నీవే కావాలి. నీవు యుద్ధంచేయకున్నాసరే" అన్నాడు అర్జునుడు.

"నాకు నీ అద్భుత సైన్యం ఇప్పిస్తే చాలు" అన్నాడు దుర్యోధనుడు. "సరే" అన్నాడు కృష్ణుడు.

# బలరాముని సన్యాసం

అక్కడినుండి దుర్యోధనుడు బలరామునివద్దకు పోయినాడు. "నాకు నీ సహాయంకావాలి" అన్నాడు. "నేను ఎవరికీ ఎట్టిసహాయంచేయను. మీ యుద్ధాలూ,

మహా నాకు నచ్చవు. అన్నా దమ్ములు కొట్టుకోచావడంలో ఏం అర్థమో నాకు తెలియదు. మా తమ్ముడు అనవసరంగా ఈ వ్యవహారాల్లో జోక్యం కలిగించు కుంటున్నాడు. సరే అతని ఇష్టం అతనిది. నేను సుఖంగా తీర్థయాత్రలు చేస్తాను" అన్నాడు బలరాముడు. మహా బలపరాక్రమవంతుడైన బలరాముడు తనకు ఎట్టి సహాయం చేయడానికీ ఒప్పుకోనందుకు దుర్యోధనుడు విచారించినాడు. అయితే బలరాముడు ఎవరి పక్షాన చేరనందుకు సంతోషిస్తూ ఇంటికి వెళ్ళిపోయినాడు



సంధి విఫలమైనది
సమరమె కానున్నది
కురుజాతి మహావిటపం
విరిగి పోవనున్నది.

పొగరెక్కిన దుర్యోధన
భూమీశుడు, సూతసుతుడు
శాంతినెటుల వాంఛింతురు ?
సర్వనాశ మూహింతురు.

ఎన్ని గుండియలు కావలె
వెన్నుని బంధించుటకై
కౌరవులకు మది గడియలు
కావుననే చెడుతలంపులు.




*కరిఘటల ఘీంకృతులతో*
*తురగహేషార్భటులతో*
*కురుభూమి దద్దరిల్లినదీ*
*ప్రళయాబ్ధివోలె కదలినదీ*

*అల్లదో భీష్ముండు*
*అదిగో బీభత్సుండు*
*మదపు టేనుగు రీతి*
*కొదమ సింగము భాతి॥*

## (భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలు)

కౌరవ సైన్యానికి భీష్ముడు సర్వసేనాధిపతి అయినాడు. అతనిక్రింద పదకొండు అక్షౌహిణుల సైన్యం వున్నది. పాండవుల సేనకు ద్రుపదుని కుమారుడు ధృష్టద్యుమ్నుడు సేనాపతిగా నియమించబడినాడు. అతనిక్రింద ఏడు అక్షౌహిణుల సైన్యం వున్నది.

ఉభయసేనలూ కురుక్షేత్రం అనేచోట కలుసుకొన్నవి. ఇక యుద్ధం ప్రారంభం అయ్యే గడువు సమీపించింది.



ధర్మరాజు తన ఆయుధాలను రథంలోవుంచి కాలినడకన "భీష్ముని వద్దకు పోయినాడు. ఆయనకు నమస్కరించి తనను ఆశీర్వదించ వలసినదిగా కోరినాడు. భీష్ముడు చాలా సంతసించి "నీకు శుభం కలుగుగాక" అని దీవించినాడు. "శత్రు పక్షంలోవారినైనా యుద్ధానికి ముందు పెద్దలను కలుసుకోవడానికి వచ్చిన నీ సౌశీల్యం గొప్పది. నీకు ఒక వరం ఇవ్వదలచినా . కోరుకో" అన్నాడు ధర్మరాజుతో భీష్ముడు. "అయితే నన్ను యుద్ధంలో గెలిచే విధానం చెప్పు" అని అడిగినాడు ధర్మరాజు. "నన్ను యుద్ధంలో దేవతలైనా గెలువలేరు. అయినా అడిగినావు కనుక చెబుతున్నాను. నేను చేతబట్టిన ఆయుధాన్ని నాచేతినుండి తప్పించితే తప్ప నన్ను గెలువలేరు. ఐతే ఆయుధం ఎలా తప్పించాలో మరెప్పుడైనా చెబుతాను" అన్నాడు భీష్ముడు.

ఆ తరువాత ధర్మరాజు గురు కృప శల్యాదులకు నమస్కారంచేసి వారితో యుద్ధం చేయడానికి అనుమతి తీసుకున్నాడు.

## కిరీటి పిరికితనం

అర్జునుడు రథం ఎక్కి ఉభయసేనల మధ్యకువచ్చి ఆగినాడు. రెండు వైపులా కలయ చూచినాడు. అంతా తనవాళ్ళే కనిపించినారు. తాతలు, తండ్రులు, అన్నలు, తమ్ములు, పుత్రులు, మిత్రులు, స్నేహితులూ, గురువులూ. వీళ్ళందరితో యుద్ధం చేయడానికి మనస్కరించలేదు. ఇందరిని చంపి సాధించేదేమిటి ? అనుకున్నాడు. తన ధనుస్సును రథంలో పడవేసి చతికిలబడి నిరాశతో నిరుత్సాహంగా కూర్చున్నాడు.

"యుద్ధం ప్రారంభంకాబోతున్న సమయంలో ఎంతో ఉత్సాహంగా ఉండవలసినవాడవు డీలపడి కూర్చున్నావేమి,బావా!" అని కృష్ణుడు అర్జునుణ్ణి అడిగినాడు.

"ఎటుచూచినా మనవాళ్ళే కనిపిస్తున్నారు. రాజ్యకాంక్షతో వాళ్ళందరితో పోట్లాడి వారినిచంపి మనంచచ్చి ఏంసాధిస్తాం ? పరస్పరం యుద్ధంవల్ల ఏమి ప్రయోజనం

కలిగేట్టులేదు. అమాయకు లెందరో చచ్చి, వారి బంధువులంతా వారికోసం వగచి నానాబాధలూ పడతారు. నాకు యుద్ధం చేయడానికి మనసొప్పటంలేదు బావా'' అని



ఉభయ సైన్యములమధ్య అర్జునునికి గీతోపదేశం చేయుచున్న శ్రీకృష్ణభగవానుడు

దీనంగా అర్జునుడు పలికినాడు. అర్జునుని కన్నులలోనుండి కన్నీరు బొటబొటకారింది. అతనిమనస్సులో విషాదంక్రమ్ముకున్నది. శోకంపొంగివచ్చింది. కరుణఆవరించింది.

## శ్రీకృష్ణుని ఉపదేశం

అప్పుడు కృష్ణుడు ఇలా అన్నాడు : ''ఈ సమయంలోనా నీవు ఇట్లా నిరాశ పడవలసింది ? నీకు ఈ ఆడుదనం ఎలావచ్చింది ? వీరంతా నీకు బంధువు

లంటున్నావు. జగత్కంటకులైన వీరిపైన నీవు దయచూపుతావా? మిమ్మల్ని, మీభార్యను ఎన్నికష్టాలు పెట్టినారు? ఎన్నడైనా వారి మనసులో మీపట్ల దయకలిగిందా? పాషాణ హృదయులైన దుర్యోధనాదులను చూచి జాలిపడుతున్నావా?''

శ్రీకృష్ణుడు ఇంకా ఇలా అన్నాడు: "నీవు ఉత్తమక్షత్రియుడవు. నీ ధర్మం శత్రువులను జయించడం. నీ స్వకర్మను నీవు విడుస్తావా? నీవు వీళ్ళందరినీ చంపితే పాపం పాలవుతాననుకుంటున్నావు. ఇట్టి అన్ని ధర్మాలోచనల్నీ మరచిపో. నన్ను ఒక్కణ్ణే ఆశ్రయించు. నేను నీకు, అన్నిపాపాలనుండీ విముక్తి కలిగిస్తాను."

ఈ మాటలతో శ్రీకృష్ణుడు తన విశ్వరూపం చూపించినాడు. వేయిసూర్యుల కాంతికంటె ఇనుమిక్కిలిగా వెలుగుతున్న ఆ మహామూర్తిని అర్జునుడు చూడ లేక పోయినాడు. అప్పుడు శ్రీకృష్ణుడు అతనికి దివ్యచక్షువులు ఇచ్చినాడు. అప్పుడు కండ్లారా ఆ మహామూర్తిని చూచి అర్జునుడు ఉప్పొంగి పోయినాడు.

శ్రీకృష్ణుని ఉపదేశంవల్ల అర్జునునిలో మళ్లీ ధైర్యసాహసాలు వచ్చినవి. నిరాశ పోయింది.

యుద్ధం ప్రారంభమైంది. కోలాహలంగా సైన్యాలు ఢీకొన్నవి. సైనికులు ఒకరినొకరు నరుక్కుంటున్నారు. ఏనుగులు ఘీంకరిస్తున్నవి గుట్టలవలె కూలుతున్నవి. వికలాంగాలు రాసులుగా కానవస్తున్నవి.

భీష్ముని నాయకత్వంలో కౌరవ సైన్యం చాలా ఘోరంగా పోరాడుతున్నది. పాండవుల సైన్యాలు చెల్లాచెదరు అవుతున్నవి. భీష్ముని తుదముట్టించందే కౌరవులను గెలవడం అసాధ్యం అనిపించింది పాండవులకు.

యుద్ధం ప్రారంభమై తొమ్మిది రోజులైంది. భీష్ముని ఎట్లా హతమార్చాలో పాండవులకు తోచలేదు. ప్రళయకాల రుద్రునివలె భీష్ముడు పాండవ సైన్యాలను నుగ్గునూచు చేస్తున్నాడు.



భీష్మునిపైకి చక్రము నెత్తిన శ్రీకృష్ణుని వారించుచున్న అర్జునుడు

అర్జునునికీ భీష్మునికీ యుద్ధం ఘోరంగా జరుగుతున్నది. భీష్ముడు మరీ విజృంభించి యుద్ధం చేస్తున్నాడు. అర్జునుడు వెనుకాడుతున్నాడు. అదిచూచి శ్రీకృష్ణుడు రథంమీదినుంచి దిగి తన చక్రాన్ని గిఱ్ఱున త్రిప్పి భీష్మునిమీదికి విసరబోయినాడు. అప్పుడు అర్జునుడు అడ్డువచ్చి వారించినాడు.

## భీష్ముని ఔదార్యం

ఆ రాత్రి ధర్మరాజు భీష్ముని విడిదికి పోయినాడు. "తాతా! నీ చేతిలోని ఆయుధాన్ని తప్పించే మార్గం ఎప్పుడైనా చెబుతానన్నావు. ఇప్పుడు చెప్పు. నిన్ను ఎదిరించలేకుంటావున్నాం" అని అడిగినాడు.



అంపశయ్యపై నున్న భీష్ముని పరామర్శించుచున్న శ్రీకృష్ణుడు, పాండవులు

"పుట్టినప్పుడుగాక నడుమ పురుషత్వంవచ్చిన వాడితో నేను యుద్ధంచేయను. శిఖండి అట్టివాడు. వాణ్ణి అడ్డంపెట్టుకుని నన్ను కొట్టండి. నేను శిఖండిని చూచి నాక యుద్ధంచేయను" అని తనను ఓడించే ఉపాయం భీష్ముడు చెప్పినాడు.

పదవనాటి యుద్ధంలో అర్జునుడు అట్లాగే చేసినాడు. అర్జునుని బాణాలకు తాళలేక భీష్ముడు క్రిందపడిపోయినాడు. వెనుక తనతండ్రి ఇచ్చిన వరంవల్ల భీష్ముడు తన ఇష్టం వచ్చినప్పుడు చావగలడు గనుక ఉత్తరాయణం ప్రవేశించే దాకా బాణాలశయ్యమీదనే పడుకున్నాడు. దప్పిగొన్న భీష్మునినోట నీరు పోయడానికి కౌరవులురాగా తనకు పాతాళగంగ కావాలన్నాడు. అప్పుడు అర్జునుడు వారుణాస్త్రంతో పాతాళగంగను భూగర్భంలోనుంచి ధారగా పైకివచ్చేట్టు చేసినాడు. ఆ ధారను గ్రోలి భీష్ముడు అర్జునుని ఆశీర్వదించినాడు.

## పద్మవ్యూహం

భీష్ముడు పడిపోవడం కౌరవులకు నడుము విరిగినట్లయింది. అతనిస్థానంలో ద్రోణాచార్యులు సర్వసేనాధిపతి అయినాడు. అతడు సైన్యంతో పద్మవ్యూహం నిర్మించినాడు. ఆ సమయాన అర్జునుడు సంశప్తకులతో పోరాడడానికి మరోవైపు పోయివున్నాడు.

పద్మవ్యూహాన్ని భేదించడం పాండవులలో అర్జునునికి తప్ప మరెవ్వరికీ తెలియదు. సైన్యాధిపతి అయిన ధృష్టద్యుమ్నునికి కూడా పద్మవ్యూహం భేదించడంరాదు. అప్పుడు అభిమన్యుడు "నేను పద్మవ్యూహం భేదిస్తాను" అన్నాడు. "నాయనా! నీవు చిడుచిన్నవాడవు వాళ్ళు దుర్మార్గులు. నీవు వెళ్ళవద్దు" అన్నాడు ధర్మరాజు. "ఏం భయంలేదు. ఐతే నాకు వ్యూహం భేదించడం వచ్చుగాని తిరిగి రావడం రాదు. కనుక మీరు కాస్త నాకు వెనక సహాయంగా వుండండి. నిర్భయంగా వ్యూహాన్ని భేదిస్తాను" అన్నాడు అభిమన్యుడు. అతని ధైర్యానికి అంతా సంతోషించినారు.

వెంటనే అభిమన్యుడు వ్యూహంలో చొరబడి భేదించుకుంటూ ముందుకు పోయినాడు. అతనివెంటనే ధర్మరాజూ, భీముడూ, నకుల సహదేవులూ వెళ్ళినారు.

కాని సైంధవుడు వారికి అడ్డువచ్చినాడు. వాడు చాలా బలవంతుడు. వానిని తప్పించుకునేలోపుగా అభిమన్యుడు చాలా దూరం వెళ్ళిపోయినాడు. పాండవులకు అతని జాడ తెలియలేదు.



కర్ణుడూ, దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ మొదలగువారంతా కలిసి అభిమన్యుని చంపుట

అభిమన్యుడు దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శల్యాదులను హడలగొట్టి వ్యూహాన్ని బద్దలుకొట్టినాడు. అభిమన్యుని పరాక్రమానికి అంతా ఆశ్చర్యపడ్డారు. కౌరవ సైన్యం అంతా చెల్లాచెదరై పోయింది.

ఈ పసివాణ్ణి బ్రతకనిస్తే ముందు ముందు తమకు చాలా ప్రమాదం కలుగుతుందనుకున్నారు కౌరవులు. ఒక పన్నాగం పన్నినారు. కర్ణుడు, కృపా

చార్యుడు, దుర్యోధనుడు మున్నగువారు దొంగచాటుగావచ్చి అభిమన్యుణ్ణి ఆక్రమించినారు. ఒకడు చాటుగా అతని ధనస్సువిరగ్గొట్టగా ఇంకొకడు అతని రథం గుఱ్ఱాలను చంపినాడు. ఒంటరివాణ్ణిచేసి అంతాకలిసి అన్నివైపులనుంచీ వెంటబడి అతన్ని చంపివేసినారు.

## సైంధవ సంహారం

అభిమన్యుని మరణానికి పాండవులంతా రోదించినారు. యుద్ధరంగంనుంచి తిరిగివచ్చి అర్జునుడు తన కుమారుని మరణవార్త విని మూర్ఛల్లినాడు. కొంత సేపటికి తెప్పరిల్లి లేచి "అభిమన్యుని మరణానికి కారణుడైన సైంధవుణ్ణి రేపు



అర్జునుడు సైంధవుని శిరస్సును ద్రుంచి పాశుపతాస్త్రముతో అతనితండ్రి వద్దకు పంపుట

సైంధవుని శిరస్సు అతనితండ్రిదోసిలిలో పడి తండ్రి మరణించుట

సాయంత్రం అయ్యేలోగా చంపుతాను. అలా చంపకపోతే అగ్నిలో దూకి ప్రాణాలు విడుస్తాను''అని శపథం చేసినాడు. అన్నట్లే రెండవనాడు సైంధవుణ్ణి చంపినాడు.

## ఘటోత్కచుని అస్తమయం

సైంధవుణ్ణి చంపిననాటి రాత్రి సైనికులు ఎప్పటిలా శిబిరాలకు పోలేదు. కాగడాలు దీపాలు పట్టుకుని యుద్ధంచేసినారు. కౌరవులపక్షాన అలంబసుడనే రాక్షసుడొకడున్నాడు. వాడు ఆరాత్రి పాండవుల సైన్యాన్ని పిండిగొట్టడం మొదలుపెట్టినాడు.



ఘటోత్కచుని చంపుటకై ఇంద్రశక్తిని ప్రయోగించుచున్న కర్ణుడు

అదిచూచి ఘటోత్కచుడు అలంబసునిపైబడి మెడనులిమి చంపివేసినాడు. అంతటితోఆగక ప్రతీకారచర్యగా కౌరవసైన్యం మీదపడి పీనుగు పెంట

చేసినాడు. కౌరవసైన్యం భీతిల్లి పారిపోవడం మొదలు పెట్టింది. కర్ణునికి ఘటోత్కచుణ్ణి ఎదిరించక తప్పిందికాదు. తన శక్తిబాణం ఉపయోగించి ఘటోత్కచుణ్ణి చంపినాడు. అంత ప్రభావవంతమైన శక్తిబాణాన్ని మరెప్పటికైనా దాచుకుందా మనుకున్న కర్ణుడు ఘటోత్కచుని మీద వాడవలసి వచ్చింది. అసలు ఆ బాణం అర్జునుణ్ణి చంపడానికి దాచివుంచినాడు.

## సేనాధిపతిగా ద్రోణుడు

యుద్ధం ప్రారంభమై పదిహేను రోజులైంది. ద్రోణుడు కౌరవ సేనకు



ధృష్టద్యుమ్నుడు ప్రాణములు పోయిన ద్రోణుని శిరము ఖండించుట

అధిపతియై ఆనాటికి అయిదురోజులు. ఆనాడు భీముడు "అశ్వత్థామ" అనే పేరు గల ఏనుగును చంపినాడు. అదిచూచి ద్రోణుడు వినునట్లుగా ధర్మరాజు "అశ్వత్థామ చచ్చెను" అన్నాడు. అతనికి వినపడకుండా అది ఏనుగుఅన్నాడు. "ఏనుగు" అన్నమాట ద్రోణునికి వినరాలేదు. తన కుమారుడగు అశ్వత్థామ చచ్చినాడని నమ్మి ద్రోణుడు దుఃఖంతో ప్రాణాలు విడిచినాడు. అంతట, తన తండ్రిని చంపిన పగతీర్చుకొనుటకై ధృష్టద్యుమ్నుడు చనిపోయిన ద్రోణుని శిరము వలదు వలదు అని కృష్ణార్జునులు వారించుచున్నను వినిపించుకొనక ఖడ్గముతో నరికివేసెను.



## శల్య సారథ్యం

ద్రోణుడు చనిపోయిన తరువాత కౌరవ సైన్యానికి కర్ణుడు సేనాధిపతి అయినాడు. కర్ణుడు శల్యుణ్ణి తన రథానికి సారథిగా నియమించినాడు. శల్యసారథ్యంలో కర్ణుడు విజృంభించి యుద్ధంచేసినాడు. అర్జునుడు అతన్ని ఎదుర్కొన్నాడు.

## దుశ్శాసనుని దుర్మరణం

దుశ్శాసనుడు భీమునితో యుద్ధానికి వచ్చినాడు. భీముడు రథందిగి దుశ్శాసనుణ్ణి రథంమీదినుంచి క్రిందబడలాగినాడు. ముష్టియుద్ధం ప్రారంభించినాడు. భీముని గ్రుద్దులకు దుశ్శాసనుని శరీరం లుకలుకలై పోయింది. శరీరంలో జవం

ఉడిగి దుశ్శాసనుడు నేలకు వాలినాడు. భీముడు దుశ్శాసనుని క్రిందపడవైచి వాని డొక్కను తన గోళ్ళతో చించినాడు. గుండెను పగులగొట్టినాడు. నెత్తురు దోసి



దుశ్శాసనుని గుండెలుచీల్చి రక్తముత్రాగిన భీముడు

ళ్ళతో తాగినాడు. పేగులు మెడలో వేసుకున్నాడు. మరికొంత రక్తం దోసిటితో తీసుకుపోయి ద్రౌపది కురులకు రాచి చిరకాలంగా ముడువకుండావున్న వాటిని తనచేతులతో ముడిచినాడు.

## కర్ణార్జునుల యుద్ధం

మరోవైపు కర్ణుడూ అర్జునుడూ ఘోరంగా యుద్ధంచేస్తున్నారు. కర్ణునికి సహాయంగా అతనికొడుకు వృషసేనుడు యుద్ధం చేయసాగినాడు. అదిచూచి అర్జునునికి తన కుమారుడైన అభిమన్యుడు జ్ఞాపకంవచ్చినాడు. తాను లేనప్పుడు తనకుమారుణ్ణి చంపినవారిలో కర్ణుడు ముఖ్యుడు. అందుకు ప్రతీకారంగా వృషసేనుణి చంపాలనుకున్నాడు అర్జునుడు. ఒక్కబాణంతో వానితల తెగనరికినాడు. రుద్రుడివలె కోపోద్రేకంలో అర్జునుడు కర్ణుని మీదకు దూకినాడు. కొడుకు మరణంతో నిరుత్సాహపడియున్న కర్ణుడు అర్జునుని ధాటికి ఆగలేక వెనక్కు తిరిగినాడు.

రెండోరోజు కర్ణార్జునులకు మళ్ళీ యుద్ధం జరిగింది. నిన్న తన కుమారుణ్ణి చంపినాడనే కోపంతో కర్ణుడు ఒక భయంకరమైన బాణాన్ని అర్జునుని కంఠానికి గురిచూచి వదలినాడు. శ్రీకృష్ణుడు తెలివిగా తన రథాన్ని క్రిందికి త్రొక్కినాడు. అర్జునుని కంఠానికి సూటిగావస్తున్న బాణం అతని కిరీటానికి తగిలింది. కృష్ణుని రథసారథ్యంలోని చాకచక్యం వల్ల అర్జునుడు చాలాసార్లు కర్ణునిబాణాలను తప్పించుకుని బ్రతికినాడు.

## కర్ణుని నిర్యాణం

ఇంతలో వెనుక బ్రాహ్మణుని వలన కలిగిన శాపంవల్ల కర్ణునిరథం రణరంగంలో భూమిలోకి దిగడం మొదలుపెట్టింది. చక్రాలు క్రుంగిపోవడం చూచి కర్ణుడు రథందిగి చక్రాలు పైకిఎత్తడానికి ప్రయత్నం చేసినాడు.



రథము నెత్తుచున్న కర్ణుని శ్రీకృష్ణుని ప్రోత్సాహమున వధించుచున్న అర్జునుడు

ఇదే అదనని అర్జునుడు కర్ణుని కంఠాన్ని ఒకదివ్యబాణంతో ఛేదించినాడు. కర్ణుడి శరీరంలోంచి ఒక తేజస్సు బయలుదేరి సూర్యునిలో కలిసి పోయింది. కర్ణుని రెండురోజుల సేనాధిపత్యం అతని మృతితో ముగిసింది.

## శల్యాదుల మరణం

కర్ణుడు చనిపోయిన తరువాత శల్యుడు కౌరవ సేనాని అయినాడు. శల్యునితో ధర్మరాజు తలపడినాడు. ఘోరంగా యుద్ధం చేసినాడు. యుద్ధంలో శల్యుడు ధర్మరాజుచేత చచ్చినాడు. సహదేవుడు అదే సమయాన శకునిని చంపినాడు.

## మిగిలినవాళ్లు నలుగురే

ఇక కౌరవులవైపు మిగిలిన వీరులు నలుగురే. వారు దుర్యోధనుడు, అశ్వత్థామ, కృపాచార్యులు, కృతవర్మ. తక్కినవాళ్ళంతా అదివరకే చచ్చినారు. కౌరవుల పదకొండక్షౌహిణుల సేన నాశనమైపోయింది. దుర్యోధనుని తమ్ము లంతా మరణించినారు.

## దుర్యోధనుని తడిగడియలు

ఈ భీభత్సం అంతా చూచి దుర్యోధనుని గుండె చెదిరిపోయింది. పిరికి పట్టుకుంది. అన్నివైపులనుండి పాండవులు తనను వెన్నాడుతున్నట్లనిపించింది. తనవాడనేవాడు ఒక్కడూ దగ్గరలేడు. కనురెప్ప వాల్చడానికి భయం వేస్తున్నది. శరీరం డస్సిపోయింది. విశ్రాంతిలేదు.

దుర్యోధనునికి జలస్తంభనవిద్య వచ్చును. నీళ్ళల్లో మునిగి ఎన్నిగంట లైనా ఉండగలడు. ఈ సమయాన ఆవిద్యను వినియోగించుకుందా మనుకున్నాడు. ద్వైపాయనం అనే పేరుగల ఒక కొలనులో మునిగి అడుగున దాక్కున్నాడు.

## కొలనులో దాగిన కురువీరుడు

ఎంతవెతికినా పాండవులకు దుర్యోధనుడు దొరకలేదు. పారిపోయినాడని నిశ్చయించుకున్నారు. కాని శత్రువును పారిపోనివ్వడం గూడా ప్రమాదమే అందుకోసం అతన్ని వెతికి పట్టుకురావాలనుకుని అడవ్యాలూ, గుట్టలూ, కొల నులూ వెదకడం ఆరంభించినారు. అప్పుడు కొందరు బాటసారులు దుర్యోధనుడు ద్వైపాయనహ్రదంలో చొరబడగా చూచినామని పాండవులకు చెప్పినారు.

ధర్మరాజు హ్రదం ఒడ్డునుంచి దుర్యోధనుణ్ణి పిలుస్తూ. "పాపీ! పిరికి పందవై పారిపోయేవాడవు ఇంతమంది బంధువులు, తమ్ములు, అనుచరులు,

యుద్ధరంగంలో చచ్చేదాకా ఎందుకు బిగుసుకో కూచోవలసివచ్చింది ? నీ వల్లకదా నీవాళ్ళంతా చచ్చినారు ? ఇప్పుడు నీ ఒక్క ప్రాణం దాచుకోడానికి పిల్లివలె తప్పించుకొని వచ్చి కొలనులో దాక్కున్నావా ?'' అన్నాడు. ఆ మాటలు దుర్యోధనుని గుండెలో బల్లెమువలె గుచ్చుకున్నవి. అయితే కొలనులో నుండి బయటికి



మడుగులో దాగిన దుర్యోధనుని పాండవులు పిలుచుట

వచ్చే ధైర్యంరాలేదు .''నేను పిరికివాణ్ణికాను. విశ్రాంతి కోసం ఇక్కడికి వచ్చినాను. మీరు గూడా అలసి ఉండవచ్చు. విశ్రాంతితీసుకోండి. ఆ తరువాత పోట్లాడుదాం'' అని జవాబిచ్చినాడు. ''ఇప్పుడేం విశ్రాంతి ? నీవో మేమో చావడం తేలినాక తుదకు

విశ్రాంతి. యుద్ధం పూర్తికానిదే విశ్రాంతి తీసుకునేది లేదు. నీళ్ళలోనుంచి బయ
టికిరా'' అన్నాడు ధర్మరాజు.

"మీకు కావలసింది రాజ్యమేకదా! తీసుకోండి. నాకు రాజ్యంతోపనిలేదు. మీకు కావలసింది దొరికేనాక ఇంకా యుద్ధం ఎందుకు? నేను అడవుల్లో తపస్సు చేసుకుంటాను'' అన్నాడు దుర్యోధనుడు.

"ఇప్పుడు రాజ్యం ఇస్తానంటున్నావా? నీ చేతుల్లోంచి ఎన్నడో జారిపోయిన రాజ్యాన్ని నీ వేం ఇస్తావు? ఇంత యుద్ధానికి కారకుడవైన నిన్ను శిక్షించడం ప్రథమ కర్తవ్యం. తరువాత రాజ్యంమాట ఆలోచింతాం'' అన్నాడు ధర్మ
జుడు. దుర్యోధనునికి పౌరుషం హెచ్చింది. ఎలాగూచచ్చేవాణ్ణి పిరికివాడుకావడం దేనికి అనుకున్నాడు. గదపుచ్చుకుని నీళ్ళలోంచి బయటికి వచ్చి భీమునిమీదికి దూకినాడు.

## గదా యుద్ధం

భీముడు దుర్యోధనుడు ఘోరంగా గదా యుద్ధంచేసినారు. ఎంతసే
పోట్లాడినా ఎవ్వరూ ఓడేట్టు లేరు. ఎవ్వరూ గెలిచేట్టూలేరు.

ఇది ఇలాగే సాగితే ఎన్నాళ్ళకూ తెగదనిగుర్తించి శ్రీకృష్ణుడు భీమునికి
దుర్యోధనుని తొడమీద కొట్టుమని సంజ్ఞచేసినాడు. అప్పుడు భీమునికి ఆనాడు సభలో ద్రౌపదిని తొడమీద కూర్చోమన్నమాట జ్ఞాపకంవచ్చింది. రక్తంపొంగి కళ్ళల్లోనుంచి దూకింది. ముఖం ఎఱ్ఱబారిపోయింది. మహాకోపంతో గద పైకెత్తి ఒక్కదెబ్బ వేసినాడు. ఆ దెబ్బతో దుర్యోధనుడు తొడవిరిగి క్రింద బడ్డాడు.



భీమ దుర్యోధనుల గదాయుద్ధము

ఏదా విరగవై పోయిందని పాండవులు ఒక నిట్టూర్పు విడిచినారు. అశ్వ
దుర్యోధనుని ప్రక్కన కూర్చుని ఏడ్చినాడు. "ఏడ్చి ఏంలాభం నాయనా !
చేసుకున్నదే అయింది" అన్నాడు దుర్యోధనుడు మూల్గుతూ.

## అశ్వత్థామ అమానుషచర్య

అప్పుడు అశ్వత్థామ ఇలాఅన్నాడు: "మనం అంతా ఎలాగూ నాశనమై
వాళ్ళవంశాన్నికూడా నాశనం చేస్తాను". ఈ మాటంటూ కృప, కృతవర్మ
వెంటపెట్టుకుని పాండవుల శిబిరంవైపు వెళ్ళినాడు.

దుర్యోధనుడు తొడవిరిగి పడిపోగానే విజయోత్సాహంతో పాండవులు కృష్ణునివెంట ఆయన ఇంటికి వెళ్ళినారు. పాండవుల శిబిరంలో ఉపపాండవులు అయిదుగురూ, ధృష్టద్యుమ్నుడూ పడుకొనియున్నారు. కృప, కృతవర్మలను శిబిర-



ఉపపాండవులను చంపి ధృష్టద్యుమ్నుని వధించుచున్న అశ్వత్థామ

ముందు కాపుంచి అశ్వత్థామ లోపలికి వెళ్ళినాడు. ఉపపాండవులను వరుసగానరికివేసినాడు. ధృష్టద్యుమ్నుని డొక్కలో కత్తితో పొడిచివేసినాడు. ఆ తరువాత అతని గుండెల్లో పొడిచినాడు. ఆ తరువాత తలమీద పొడిచినాడు. ఇలా చిత్రహింసచేసి చంపినాడు.

ఒంటినిండా నెత్తురు పూసుకుని వికారంగాను, భయంకరంగాను వెళ్ళి అశ్వత్థామ దుర్యోధనునితో ఇలా అన్నాడు : "నేను శపథం చేసినట్టు పాండవ వంశాన్ని నిర్మూలించినాను." "ఏంచేసినావు" అని అడిగినాడు దుర్యోధనుడు. "ఉపపాండవులను అయిదుగురిని నరికిపారవేసినాను" అన్నాడు. "అయ్యో! తిలతర్పణం చేయడానికైనా ఎవరూ మా వంశంలో లేకుండాచేసినావా!" అని దుఃఖపడుతూ దుర్యోధనుడు నిట్టూర్పు విడిచి మరణించినాడు.

## ద్రౌపది సంతాపం

ద్రౌపది తన కుమారుల మరణానికి ఎంతో ఏడ్చింది. ఆమె బాధను భీముడు చూడలేక పోయినాడు గద చేత పుచ్చుకుని అశ్వత్థామ వెంటపడినాడు. భీముడొక్కడు అశ్వత్థామను ఓడించలేడని కృష్ణునికి తెలియును. అందుకే ధర్మ రాజును, అర్జునుణ్ణి సహాయం పంపినాడు.

## అశ్వత్థామకు అవమానం

మొదట అశ్వత్థామ నిర్భయంగా భీమునితో పోరాటం మొదలు పెట్టినాడు. కాని ధర్మరాజు, అర్జునుడు కనిపించేసరికి నిలువున ప్రాణాలు లేచిపోయినట్లైంది. చాలా భయపడి ఏమిచేయడానికి తోచక తనవద్దగల బ్రహ్మశిరోనామక బాణాన్ని మంత్రించి "పాండవులవంశం నశించిపోవుగాక" అని పలికి ప్రయోగించినాడు.



అది బ్రహ్మాండమైన తేజస్సును చిమ్ముతూ, నిప్పులు కక్కుతూ ఆకాశంలో సాగి వస్తున్నది. అదిచూచి అర్జునుడు కూడా అదేరకం బాణాన్ని ప్రయోగించినాడు. రెండుబాణాలు సమానబలం గలవి గనక అవి ఒండొంటిని తాకడంవల్ల లోకాలన్నీ మాడిపోతవని భయపడి వాటి మధ్యకువచ్చి వ్యాసుడు, నారదుడు నిలబడ్డారు.



అశ్వత్థామ మణినితెచ్చి ద్రౌపదకిచ్చుచున్న అర్జునుడు, మిగతా పాండవులు

వారిద్దరూ అశ్వత్థామతో ఇలా అన్నారు: "శ్రీకృష్ణ భగవానుడు పాండవ పక్షాన ఉన్నాడు. అసలు వారిని జయించడం నీతరంగాదు. ఇప్పుడు నీవు చేయ వలసిందలా నీబాణాన్ని ఉపసంహరించుకుని, నీ తలలోగల మణిని వారికిచ్చి



ధర్మజునికి పట్టాభిషేకం

ధర్మరాజు వారి కోరికను కాదనలేక పట్టాభిషేకానికి అంగీకరించి
ధర్మరాజు పట్టాభిషేకం చాలా వైభవంగా జరిగింది. దేశదేశాల జనుల
పండుగవలె పట్టాభిషేక ఉత్సవం చేసుకున్నారు. ధర్మరాజు పరిపాలనావిధ
మళ్ళీ స్థిరపరచినాడు. ప్రజల సౌకర్యంకోసం ఎన్నో సత్రాలను కట్టిం
చెరువులు త్రవ్వించినాడు. చాలా ధర్మకార్యాలు చేసి ప్రజలను సుఖపెట్టినాడు

## ఉత్తరకు జన్మించిన వింతశిశువు

ఇంతలో అభిమన్యునిభార్య ఉత్తర ఒక శిశువును కన్నది. ఆ శిశు
నప్పుడే చచ్చిఉన్నాడు. అదిచూచి అంతా ఏడ్చినారు. తమ వంశానికి



చచ్చిపుట్టిన పరీక్షిత్తును బ్రతికించుచున్న శ్రీకృష్ణుడు

మున్ముందు ఆధారం అవుతాడని ఆశించిన శిశువు పుట్టినప్పుడే చచ్చి వుండడంవల్ల పాండవులకు ఎంతో విషాదం కలిగింది. తమ తరువాత వంశమే నిర్మూలమయ్యే ప్రమాదం వున్నది.

ఈ ప్రమాదాన్ని గుర్తించి శ్రీకృష్ణుడు తన చేతితో శిశువును తాకినాడు. [illegible] మాత్రాన ఆ శిశువు బ్రతికినాడు. అతడే పరీక్షిత్తు. పిల్లవాడు జీవించడంచూచి పాండవులంతా ఉప్పొంగి పోయినారు. పిల్లవాణ్ణి చాలా గారాబంగా పెంచినారు.

## అశ్వమేధ యాగము

ఆ తరువాత వ్యాసమహాముని, శ్రీకృష్ణుడు ధర్మరాజును అశ్వమేధయాగం చేయవలసిందిగా కోరినారు. దానివల్ల ధర్మరాజుకు మనశ్శాంతి కలుగుతుందన్నారు. అందుకు ధర్మరాజు అంగీకరించి అశ్వమేధం ప్రారంభించినాడు.

యజ్ఞానికి భీముడూ, వృషకేతుడు, మేఘకర్ణుడు చక్కని గుర్రాలను తెచ్చినారు. మంచి ముహూర్తంచూచి యజ్ఞాశ్వాన్ని వదలినారు. ఆ అశ్వాన్ని కాపాడే భారం అర్జునునిమీద పెట్టినారు.

గుర్రం మణిపురం చేరింది. అక్కడ బభ్రువాహనుడను వాడు గుర్రాన్ని [illegible]. ఇతడు చిత్రాంగదవలన అర్జునునికి పుట్టినవాడు. ఐతే అర్జునుడు [illegible] అని అతనికి తెలియదు.

గుర్రాన్ని పట్టివేసినందుకు అర్జునుడు బభ్రువాహనునితో యుద్ధంచేసినాడు. కొంతసేపటికి అర్జునుడు తన తండ్రి అని తెలిసి, బభ్రువాహనుడు గుర్రాన్ని వదలివేసినాడు ఆ తరువాత ఆ గుర్రాన్ని ఇంకెవ్వరూ బంధించలేదు. గుర్రం దిగ్విజయంగా తిరిగి వచ్చినపిమ్మట బ్రహ్మాండంగా అశ్వమేధయాగం జరిగింది.

# ధర్మ పరిపాలన

ధర్మరాజు పట్టాభిషిక్తుడుకాగా, భీముడు యువరాజుగా నియమించబడ్డ నాడు. విదురుడు వెనుకటి తన మంత్రి పదవిలోనే వున్నాడు. భీమ, అర్జున నకుల, సహదేవులు తోడుండగా ధర్మరాజు ధర్మపాలనం చేసినాడు. భారతదేశం లోని జనులంతా సుఖంగా ఉన్నారు. ఇట్లా ధర్మరాజు పరిపాలన ముప్పైఆరు సంవత్సరాలు సాగింది.

# స్వర్గారోహణం

ఆ తరువాత పాండవులంతా రాజ్యంవిడిచి అరణ్యవాసానికి వెళ్ళినారు. అక్కడినుంచీ స్వర్గానికి వెళ్ళినారు.





# పాలకుడుగా పరీక్షిత్తు

అభిమన్యుని కుమారుడైన పరీక్షిత్తు ధర్మరాజు స్థానాన్ని స్వీకరించి రాజైనాడు. అదేసమయాన ప్రపంచంలో కలియుగం ప్రవేశించింది. అయితే పరీక్షిత్తు ధర్మపరిపాలనంవల్ల ప్రజలు కృతయుగంలో మాదిరే సుఖపడినారు.

*పరిపూర్ణముగా పాండవ*
*చరితము విన్నారుగదా*
*ఎందరెన్ని రీతుల వ*
*ర్ణించిన నూతనము సదా॥*

*అసహనమే కౌరవులను*
*అడుగంటగ చేసినది*
*దయాగుణమే పాండవులకు*
*దండితనము కూర్చినది॥*

*బాలురు పాండవుల ధర్మ*
*శీలమ్మును జూపాలి*
*బాలికలే ద్రౌపదివలె*
*పతివ్రతలు కావాలి॥*

# పిల్లల ఉత్తమ సాహిత్యము

శంకర్స్ బొమ్మల గౌతమబుద్ధుడు {సుందరమగు బొమ్మలతో అందమగు పాటలతో} వెల రు. 2·00

శంకర్స్ బొమ్మల బాల శ్రీ కృష్ణలీలలు (సుందరమగు బొమ్మలతో) వెల రు. 1·50

శంకర్స్ బొమ్మల బాల రామాయణము {79 సుందరమగు బొమ్మలు. చక్కని గేయములతో} వెల రు. 1·50

శంకర్స్ బొమ్మల బాల భారతము {82 సుందరమగు బొమ్మలు. చక్కని గేయములతో} వెల రు. 1·50

శంకర్స్ బొమ్మల బాల భాగవతము {95 సుందరమగు బొమ్మలు. చక్కని గేయములతో} వెల రు. 1·50

పిల్లల బొమ్మల ప్రపంచ కథలు (సుందరమగు బొమ్మలతో) వెల రు. 1·50

**సిందుబాదు నావికుని కథలు** (గ్లేజు కాగితము, అందమగు బొమ్మలతో) వెల రు. 1·00

**అలాదీను అద్భుతదీపం కథ** (గ్లేజు కాగితము, అందమగు బొమ్మలతో) వెల రు. 1·00

**ఆలీబాబా-నలుబది దొంగల కథ** (గ్లేజు కాగితము, అందమగు బొమ్మలతో) వెల రు. 1·00

**పర్షియాదేశపు తెలుగుజ్జము కథ** (గ్లేజు కాగితము అందమగు బొమ్మలతో) వెల రు. 1·00

శంకర్స్ హితోపదేశ కథలు (చక్కని నీతికథలు —: బొమ్మలతో)

4 భాగములు— ప్రతిభాగము వెల రు. 0·75

శంకర్స్ తెలుగు బాలకథలు 4 భాగములు— ప్రతిభాగము వెల రు. 0·56

,, ప్రతాప రుద్రుడు వెల 0·56 శంకర్స్ చంద్రగుప్తుడు వెల 0·56

,, శ్రీకృష్ణ దేవరాయలు వెల 0·56 ,, శ్రీరాముడు వెల 0·56

,, రుద్రమదేవి వెల 0·56 ,, శ్రీకృష్ణుడు వెల 0·56